# శ్రీ భగవానుని అంతిమ బోధ

# ఉద్ధవ గీత



## సంక్షిప్త తెలుగు వచన రచన
## (మచ్చుకి కొన్ని పద్యములతో)


రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

M.Tech.

శ్రీరస్తు

శుభమస్తు అవిఘ్నమస్తు

## శ్రీ భగవానుని అంతిమ బోధ

# ఉద్ధవ గీత



**సంక్షిప్త తెలుగు వచన రచన**

**(మచ్చుకి కొన్ని పద్యములతో)**

రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.



## ప్రార్థన

ఉ॥ శ్రీలలనా శిరోమణికి చేకొని స్థానము
నిచ్చియున్ హృదిన్
పాలసముద్రమున్ విడిచి పర్వులు వెట్టెను
ఆర్తరక్షకై
ఏల కుశంక మీ మదిని ఇయ్యది 'ఆకలి'
కాలమంచు? రా
జాలదు నల్లనయ్యనుచు, సద్గతి దక్కును
జన్మధన్యమౌ

కం॥ వినుడిక ఉద్ధవ గీతను
మనసున గోవిందు తలచి భక్తి వివశులై
ధనముల, పదవుల వదిలిన
నినుజేకొను హరిభరించి నీ బాధ్యతలన్.



ఆ.వె॥వద్దు నేడు, రేపు చూద్దాములే యని
దాటవేయవద్దు తగదు, నేటి
నిదుర శాశ్వతంపు నిద్రగా మారునో
ఎవరు చెప్పగలరు? ఎవరికెరుక?

శా॥ గౌరీనాథుడు అండనుండ జగతిన్
కష్టాల చింతేలరా?
ఓరీ! మానవ! పూర్వజన్మకృతమై
ఒప్పున్‌గదా! వేదనల్
భారంబైనను మోయ తప్పదికనీ
పాపంపు గుండ్రాతినిన్
ఆరాటంబులు మాని గొల్ప్వుమికనా
హాలాహలగ్రీవునిన్



చం॥ పలుకులలోన జెప్పెదను మాధవ!
'ఉద్ధవ గీత' దీనినిన్
నిలిపి మనంబునన్ కొలిచి నీతుది బోధను
నేర్చినంతనే
కలుగును ముక్తి, పుట్టుకల కష్టము తప్పును
జన్మధన్యమౌ
తొలగును పాపపంకిలము, తోయజనాభ!
కృతార్థు జేయవే.

ఆ.వె॥వేంకటాద్రి బోలు వెలలేని స్థానంబు
ముజ్జగాల లేదు మోక్షప్రదము
వేంకటేశు సముడు వెదకినా దొరకునా?
మున్ను లేదు, రాదు ముందుముందు.

సీ॥ కులగోత్రములతోటి పలుకరింపులు లేవు
యోగిరాజీతండు ఓర్మిమెచ్చు,
మడిలేదు దడిలేదు మతమౌఢ్యమే లేదు
శ్రద్ధయే మంత్రమీ స్వామికెపుడు
ఒకసారి ఆర్తితో పెకలించి నీగొంతు
పిలిచిన పలికెడి 'పెద్దదిక్కు'
కోటీశ్వరులనైన కటిక బీదలనైన
ఒక్కరీతిగ జూచు ఉన్నతుండు

తే॥ షిర్డిలో బ్రోవదీనుల జేరెనితడు
తను పరబ్రహ్మ బాబాను మనసులోన
నిలిపి కొలువుడీ నామాట నిజము సుమ్మి!
ప్రజల కాచును ఈ సాయివ్రతము' వోలె



సీ॥ ఎవ్వడు నీ తండ్రి? ఎవ్వతె నీ తల్లి?
ఎవడురా నీ అన్న? ఎవతె చెల్లి?
ఎవ్వడు నీ తాత? ఎవ్వతె అమ్మమ్మ?
ఎవడురా మనుమండు? ఎవతె బామ్మ?
ఎవ్వడు నీమామ? ఎవ్వతె నీ అత్త?
ఎవడురా నీబావ? ఎవతె వదిన?
ఎవ్వడు కొమరుండు? ఎవ్వతె నీభార్య?
ఎవరు నీకోడలు? ఎవరు పుత్రి?

తే॥ తనువు దాల్చువరకె తనవారు పెరవారు
అవని వీడినంత ఎవరికెవరు?
నీవుచేసికొనిన నీ'మంచి' యొక్కటే
నీకు తోడునీడ, నీకు దిక్కు.



## ముందు మాట

పాఠక మహాశయులకు నా మొట్టమొదటి విన్నపం. నేను వేదాంతిని కాదు, మతముల స్వభావం పూర్తిగా ఎరిగిన వాడిని కాదు, యమనియమాది ఉపాయాలు తెలిసిన వాడిని కాదు, తత్త్వరహస్యం తెలిసిన వాడిని కాదు. గొప్ప భక్తుడిని కాదు, జ్ఞానిని కాదు, సాధకుడిని కాదు. ఇలా వ్రాస్తూపోతే, ఏమీ కాని సర్వసామాన్యుడిని. నేను ఉద్ధవగీత గురించి చెప్పటం, ఆకు మీద తేలి సముద్రంలో ప్రాణాలు దక్కించుకొన్న 'చీమ' ఎంతసేపిలా ఉండను? నీటిలోకి దూకి ఈదుకొని ఒడ్డు చేరుకొంటాను అనుకోవటం లాంటిది. దుస్సాహసం. అది నిజం.

అయినా చీమ బుద్ధి దానిని నీటిలోకి దూకేట్లు చేస్తుంది. పరమాత్ముని మాయ వలన పుర్రెకు ఒక బుద్ధి కలిగి తనమతం తనదే అంటాడు నరుడు. నాకు 'శ్రీ మన్నారాయణీయమ్' దశమస్కందం వ్రాసిన అనంతరం శ్రీకృష్ణ పరమాత్మ అవతార పరిసమాప్తి వ్రాయలేదే (అది ఏకాదశ స్కందంలో ఉన్నది)



స్వామికథ అసంపూర్తిగా చెప్పినట్లయితే అనే దిగులు పట్టుకొన్నది. కృష్ణం వందే జగద్గురుమ్ దశమస్కందం పద్యానువాదం కాబట్టి దాంట్లో స్వామి అవతార సమాప్తి వ్రాయలేను. ఏమి చేయాలో తోచలేదు.

ఎప్పటిలాగానే స్వామే స్ఫురణద్వారా నాకు కర్తవ్యం బోధించాడు. అట్లా రూపుదిద్దుకొన్నదే మీ చేతులలో ఉన్న ఈ "ఉద్ధవగీత".

ఉద్ధవునికి శ్రీకృష్ణ పరమాత్మ తన అవతార పరిసమాప్తి ముందు 1079 శ్లోకాలలో ఈ గీత వివరించాడు. సంస్కృతం రాని నాబోటివాడు అన్ని శ్లోకాలు చదివి ఎలా అర్థం చేసుకోగలదు? ఒకవేళ ఆ గండం గడిచినా వాటిని క్రోడీకరించి ఒకచోట ఎలా వ్రాయను? ఒకవేళ వ్రాసినా 600 శ్లోకాల కంటే తక్కువున్న కృష్ణం వందే జగద్గురుమ్ చదవడమే భారం అనుకొనే రోజుల్లో ఇన్ని శ్లోకాలూ తాత్పర్యాలు ఎవరు చదువుతారు? మన తృప్తి కోసం వ్రాసి దాచిపెట్టుకోవాలి.

ఇలా పరిపరివిధాలుగా ఆలోచించి పది శ్లోకాల తరువాత నిస్పృహ ఆవరించినది. ఇక నావల్ల కాదనుకోబోతుంటే

శ్రీమత్ భాగవతం ఏకాదశ ద్వాదశ స్కందాల సంస్కృత మూలం తాత్పర్య సహితంగా లభించింది. ఒక ఆధారం దొరికింది కానీ ఆ బృహద్గ్రంధానికి న్యాయం చేయలేననిపించింది. అంత ఈరోజుల్లో పేజీలకొద్దీ వ్రాసుకుంటూ పోతే చదివేవాళ్లెవరు? పైగా ఇదివరకే ఉన్నదాన్ని మళ్ళీ వ్రాస్తే వచ్చేదేమిటి?

మళ్ళీ సందిగ్ధంలో పడ్డాను. అప్పుడు నా మిత్రులు శ్రీ ఎం.వి.ఎల్.ఎన్. మూర్తిగారి ద్వారా శ్రీరామకృష్ణ మఠంవారి శ్రీమద్భాగవతము తెలుగు గ్రంధం లభించింది. శ్రీ ఏల్చూరి మురలీధర రావుగారిచే సరళాంధ్ర పరివర్తనగా వ్రాయబడిన ఆ పుస్తకం లేకపోతే ఈ ఉద్ధవగీత వెలువడేదే కాదేమో.

నేను ఆదిలోనే సూచించినట్లు ఇది సంక్షిప్తంగా చెప్పబడిన ఉద్ధవగీత. భక్తి ప్రధానాంశంగా పరమాత్మ తన ఆప్తుడైన ఉద్ధవునికి తన అవతార పరిసమాప్తిముందు చేసిన జ్ఞానబోధ ఈ ఉద్ధవగీత. అంతపెద్ద సంస్కృత మూలాన్ని ఇంత సంక్షిప్తంగా చెప్పటం వలన కొన్నిచోట్ల విపులీకరించవలసిన



అంశములను వివరించకుండా వదిలేసిన 'అగత్యం' జరిగి ఉండవచ్చు.

ఒక్కొక్క చోట వివరించనవసరం లేని అంశాలను వివరించి ఉండవచ్చు. ఏది ఏమయినా ఇదేదో గొప్ప ప్రామాణిక గ్రంధంగా భావించక సామాన్యుల స్థాయిలో శ్రీమద్భాగవతము వంటి గొప్ప కావ్యం లోని శ్రీకృష్ణ పరమాత్మ అంతిమ బోధను ఆంధ్రంలో నేను అర్థం చేసుకొన్నట్లు చెప్ప సాహసించిన నన్ను మన్నించి భగవానుని అంతిమ బోధను ఎంతవరకు న్యాయం చేశానో చూస్తే నాప్రయత్నం ఫలించినట్లే భావిస్తాను.

1966లో ఇంజినీరింగ్ విద్యార్థులకు సుపరిచితమైన ఒకమాట ఉంది. ఆమాట నిజానికి ఏ భాషలోనూ లేదు. దాన్నే "కిట్టించడం" అంటారు. అందరికీ అర్థమయేలా చెప్పాలంటే.. ఒకడికి తనకిచ్చిన లెక్కని చేయటం సరిగా రాదు. కానీ రావలసిన సమాధానం (ఆన్సర్) తెలుసు. లెక్క స్టెప్ బై స్టెప్ చేయటం రాదు. కొంతవరకు సరిగా చేసి ఆ తరువాత 'కిట్టించి' చివరికి ప్రస్ఫుటంగా సమాధానం వ్రాస్తాడు.



అధాటుగా చూస్తే లెక్కచేశాడనే అనుకుంటారు. చిన్నప్పుడు వచ్చిన దురలవాటు 'చితుకుల్లో' పెట్టేదాకాపోదు. శ్రీమద్భాగవతం (సంస్కృతమూలం) చదివిన మహానుభావులు ఇది చదువుతూ ఎక్కడన్నా ఒకచోట 'ఓరి నీ ఏం కిట్టించాడురా' అనుకుంటే...

**కం॥ చేసిన తప్పుకు చింతిలి**

**చేసితి మన్నింపుడనుచు చెప్పిన వానిన్**

**చూసీ చూడక వదులుట**

**దాసుని తప్పులకు క్షమయె తగుననుటవుగా!!**

గమనిక : ఈ పద్యం కూడా ఎందులోనూ లేదు. ఇప్పటి కిప్పుడు ఆసువుగా 'కిట్టించిందే'..

వాల్మీకి రామాయణం చదివినవాళ్లు, రావణాసురుడు సీతని పెకలించిన భూమితో సహా (తాకకుండానే) తీసుకెళ్లాడనే రామాయణ గాధను చదివి నిట్టూర్చి నవ్వుకొన్నట్లే నవ్వుకోండి.



అయితే అవన్నీ బ్రతకడం కోసం నేర్చుకొన్న "కిట్టింగులు" లాంటివి కావు. కవి అంటేనే కాల్పనికుడు. వాడు చెప్పే విషయంలో కల్పన ఎక్కువైతే అసలుకే మోసం వస్తుంది.

శ్రీకృష్ణపరమాత్మ అవతారం చాలిస్తున్నప్పుడు జరుడు అనే బోయవాని బాణం కాలిలో దిగినందువల్ల 'చనిపోతాడు' వ్యాస భాగవతంలో పరమాత్మ వానికి సశరీరంగా స్వర్గం ప్రసాదించినట్లుంది. అంతే... కానీ ఒక భాగవత గాథలో ఆ బోయవాడే త్రేతాయుగంలో 'వాలి' అని అప్పటి రాముడైన శ్రీకృష్ణుని అదేవిధంగా చెట్టుచాటునుంచి బాణంతో కొట్టి చంపి బదులు తీర్చుకొన్నాడని అట్లా అక్కౌంట్ సెటిల్ చేయించింది పరమాత్మేనని ఉన్నది.

ఇదికూడ ఒక విధంగా 'కిట్టింగే' నేను చివరికి ఏ అభిప్రాయానికి వచ్చానంటే మతము అంటే విశ్వాసం. మంచిని చెప్పటమే ఏ మతం ఆశయమైనా. మంచి ఏ ఒక్కరికో కాదు. అందరికీ మంచి జరగాలి. దానికోసం ఎలా నడుచుకోవాలో చెప్పారు. వేదవ్యాసునివంటి ఋషులు. ఆ క్రమంలో ఏది చేస్తేమంచిదో అది భగవానుని ద్వారా వినిపించాడు. ఇవి

ఋషి మనోగత ధర్మబోధలని చెప్పటానికి ఆధారం భారతంలో చెప్పిన భగవద్గీతకు, భాగవతంలో చెప్పిన ఉద్ధవగీతకు ఉన్న చిన్న చిన్న తేడాలు.

ఈ ఉద్ధవగీత చదివితే నామాటలో సత్యమున్నట్లు తెలుస్తుంది. మనకి కావలసింది ఆ తేడాలున్నట్లు నిరూపించటం కాదు. పరమాత్మ తన అంతిమ బోధలో ఏం చెప్పాడని.

నాకు పద్యాలమీద ఉన్న మక్కువ కొద్దీ అక్కడక్కడా మచ్చుకి కొద్దీ అక్కడఅక్కడా మచ్చుకి కొన్ని పద్యాలు చెప్పాను. చాల తేలిక భాష అవటం వల్ల వాటికి తాత్పర్యం వ్రాయలేదు.

ఉద్ధవుడు శ్రీ కృష్ణుని బంధువు. అతడు వృష్ణి వంశస్థులకు మంత్రి. బుద్ధిమంతుడని పేరు పొందిన అతను బృహస్పతి శిష్యుడు. విద్యాభ్యాసానంతరం శ్రీ కృష్ణుడు కంసుని మామ గారైన జరాసంధునితో శత్రుత్వం ఎదుర్కొన వలసి వచ్చింది. మధుర సింహాసనారూఢుడైన తాతగారు ఉగ్రసేనుని రక్షకుడుగా జరాసంధునితోని అతని మిత్రులైన చుది, సాల్వ, శ్రీకృష్ణుడు



ఒక్క క్షణం అదమరిస్తే మధుర మట్టి పాలవుతుంది.

తన కోసం గోపికలు పరితపిస్తున్నారని స్వామికి తెలుసు. అందుకే ఉద్ధవుని ద్వారా వారికి తన ప్రేమ సందేశం పంపిచాడు. వైరాగ్యం కలిగించే తత్త్వబోధ చెప్పించాడు. వారినికలిసి వారిని స్వార్ధమైన

ప్రేమ నిష్కళంక అనురాగం చూచి ఉద్ధవుడు చవించిపోయాడు. స్వామి ఆజ్ఞప్రకారం వారిని సంతోషపరిచటానికి శ్రీ కృష్ణుని వలె వేషధారణ చేసి, ఆయన వలె మాట్లాడి ఆయన కేతెలిసిన అతిగోప్యమైన సరసోక్తులను గుర్తుచేసి గోపికలకు ఊరటగొలిపాడు.

శ్రీ కృష్ణ సందేశంగా ప్రియతమ గోపభామినులారా!

నేను త్వరలో తప్పక మిమ్మల్ని కలుస్తాను. మీకలలను పండిస్తాను పండిస్తాను. మధురానగర రక్షణ బాధ్యత వల్ల ఇప్పుడు రాలేకున్నాను. కాని మీకంటే ప్రాణాధికులు నా కెవ్వరూలేరని గుర్తుంచుకోండి. ధీరచిత్తలై మనశ్శాంతి పొందండి.



ఇంత గొప్ప శ్రీకృష్ణ సందేశాన్ని అందించిన ఉద్ధవుడు భగవానునికి అత్యంత ఆప్తుడుని వేరే చెప్పాలా? అందేకే శ్రీ కృష్ణుడు తన అంతిమ జ్ఞానబోధను ఉద్ధవునికి చేశాడు. 700 శ్లోకాలున భగవద్గతతో పోల్చి చూస్తే 1079 శ్లోకాలున్న ఉద్ధవగీత పెద్దదే కాకుండా కొద్దిగా నిగూఢంగా కూడా ఉంటుంది. ఇదంతా మొదట్లోనే చెప్పాను.

ఈఉద్ధవ గీతనిలా అందించడానికి నామిత్రులు చాలా మంది సహాయం చేశారు. వారందరికీ ధన్యవాదములు.

నాది కూడా ఒక చిన్న అందిమ సందేశం ఉన్నది. పరులకు మంచి చేయని మానవ జన్మవ్యర్థం మంచి చెప్పని బ్రమ్మణ వ్యర్థం.

మంచి ఆలోచించని జ్ఞానం వ్యర్థం.

ఇక చదవండి....



## ఉద్ధవగీత

శ్రీమన్నారాయణుడు కృష్ణావతారమెత్తి బహుముఖ లీలలు చూసి ఆర్తత్రాణపరాయణుడై శిష్టరక్షణ,దుష్ట శిక్షణ జేసి పార్థుని ద్వారా జగతికి శ్రీమత్ భగవద్గీతనిచ్చి ధర్మసుస్థాపనజేసి నూట ఇరువది ఏడేండ్లవాడై లీలామానుష విగ్రహుడై యున్నాడు. అక్కడ వైకుంఠం చిన్నబోయింది. విష్ణుపరివారం కలవరపాటునకంతే లేకపోయింది. నారదాది మునులు నీరసించి పోయారు. శాపవిముక్తులై విష్ణుద్వార పాలురు జయవిజయులు మాధవుని రాకకై వేయికన్నులతో వేచియున్నారు. దేవతలకు దినములు లెక్కబెట్టలేక అలుపొచ్చింది.

ఒకనాడు వివిధ జాతులకు చెందిన దేవతలంతా చతుర్ముఖుడైన బ్రహ్మను సమీపించి తమ ఆవేదన నెరింగించారు. వారంతా కలిసి కైలాసమున పరమేశ్వరుని జూచి నీలకంఠుని సన్నుతించి శ్రీకృష్ణుని విష్ణుమూర్తియై వైకుంఠము నలంకరించమని ప్రార్థించెదమని నచ్చజెప్పారు.

పాకారి దేవేంద్రుడాది దేవతలు బ్రహ్మ ఈశ్వరుడు నారదాది మునీశ్వరులు ద్వారకకు బయలుదేరారు. శ్రీకృష్ణుని పరిపరివిధాల కీర్తించి చమత్కారంగా "స్వామీ! నీహృదయ స్థితయైన శ్రీలక్ష్మికి చికాకు తెప్పించునట్లు నీ భక్తులు వనమాలలతో నిన్ను అలంకరించి అనుక్షణం నిన్ను ఆశ్రయించి వినుతిస్తున్నా ఆమెను కూడ లెక్కసేయవు. పరుగులెత్తి నీ భక్తులను ఆదుకొంటావు. నీవెంత దీనరక్షాదక్షుడవైనా ఇంత సుదీర్ఘకాలం మమ్ములనెడబాయుట తగదు.

**చం॥ సమయము యేగు తెంచినది స్వామి! మనోహర**
**లీలజూపుచున్**
**విమలయశస్వివై తరలి వేగమె రమ్మిక**
**విష్ణుసీమకున్**
**మముప్రియమారనేలుటకు మాధవ! నీ**
**పరివారమంతయున్**
**కమలభవాది వేల్పులును గౌరవమొప్పగ**
**స్వాగతించగా**



అని పరిపరివిధముల ప్రార్థించిన వారందరితో శ్రీకృష్ణుడు **ఇంతవరకు భూభారమును తగ్గిస్తూ వచ్చాను. ఇక నా స్వంతవారైన యాదవులవంతు వచ్చేసింది. ఇంతకాలం నన్నాశ్రయించి సన్మార్గంలో వున్న యాదవులంతా వినాశకాలము దాపురించి మునీశ్వరుల శాపానికి గురైనారు. విధిని నేను సైతము తప్పింపలేనైతిని. వారందరిని ఓదార్చి ఒకదారి చూపించి నేను వైకుంఠసీమను జేరెదను. మీరు నిశ్చింతతో మీ మీ స్వస్థలంబుల జేరుడని బోధించి** పంపించివైచెను.

అనంతరమా శ్రీకృష్ణుడు యాదవ ప్రముఖుల నందరిని రప్పించి ఒక సభనేర్పాటుచేసి చిరునవ్వుతో వారికిట్లనెను.

**కం॥ పెను ఉత్పాతంబుల, నే**
**కనుగొంటిని యదుకులంబు కడగండ్లందున్**
**చని, తీర్థస్నానమాడుదు**
**అనఘుల్లారా! ప్రభాసమందుననిపుడే.**



వారందరు కృష్ణుడు చెప్పినట్లే కృతనిశ్చయులై ప్రయాణ సన్నాహాలు మొదలుపెట్టారు.

శ్రీకృష్ణునికి బ్రహ్మాదులకు జరిగిన సంభాషణ సారాంశం తెలుసుకొన్న ఆయన అనుంగు చెలికాడు ఉద్ధవుడు ఏకాంతంగా స్వామిని కలిసికొని తన ఆవేదన నెరింగించాడు.

**"దేవా! నీవీలోకం త్యజించనున్నావన్న వార్తలు వినవస్తున్నాయి. నీ పదకమలములను వీడి నేను క్షణమైనా జీవించలేను. ఈ దాసుని గతేమిటి? ఈ దీనునికూడ నీతోనే కొనిపోరాదా?"** అని ప్రార్థించాడు.

దానికి పరమాత్మ **నీవు వినినది సత్యమే. నా అవతార సంకల్పం నెరవేరింది. ఇంకా నేను చేయవలసినదేదియును లేదు. మునిశాపం ఫలించి తీరుతుంది. యాదవులంతా తమలో తాము కలహించి నశిస్తారు. యాదవుడనైన నాకు కూడా ఆ శాప ప్రభావం తగిలి తీరుతుంది. కలి ప్రేరణవల్ల అధర్మం వర్థిల్లుతుంది. నేటికి ఏడవ రోజున ద్వారక సముద్ర గర్భంలో కలిసిపోనున్నది. నీవు సమస్తం విడనాడి స్వజనులకు దూరంగా బంధుమిత్రులకు దూరంగా పోయి సమదర్శనుడవై**



**మనస్సు నాయందు లగ్నంచేసి భూసంచారం కావించు** అని చెప్పాడు.

ఉద్ధవుడంత **"స్వామీ! లోకమంతా గుణదోషాలతో నిండియున్నది. ఇక సమబుద్ధితో ఉండటమెలాసాధ్యం?"** అని అడిగాడు.

దానికి శ్రీకృష్ణుడు **"ఉద్ధవా! మనస్సు విక్షేపం చెంది నానాత్వం చూచుట చేత అట్లు జరుగుచున్నది. అందుచేత ఇంద్రియ గోచరమైన దేదియైనా ఏదో ఒకప్పుడు నశించిపోయేదే. మనస్సుచేత కల్పించబడి, మనస్సుచేత గ్రహించబడేవే కాబట్టి మనోమయమైన సర్వమూ మనస్సుతోబాటే నశిస్తాయి. దీనినే పరిభాషలో "మాయ" అంటారు. దీనివల్లనే నానాత్వ భావన (అదివేరు ఇదివేరు అనే భావన) కలుగుతున్నది. మంచి చెడు అనే గుణదోషబుద్ధి కల్పించబడింది.**

**ఇది కర్తవ్యం ఇది అకర్తవ్యం అనిపిస్తున్నది. ఇది పుణ్యం ఇది పాపం అనే విచక్షణ కలుగుతున్నది.**

ఈ ఆలోచనలన్నీ "అజ్ఞాన జనిత భ్రమలు" మాత్రమే. ఈ భ్రమలు తొలగనిదే మనశ్శాంతి లభింప నేరదు.

నీ మనస్సును మొట్టమొదట నిగ్రహించి, బంధించి, ఇంద్రియ విముఖం చేసి, దానిని నీ ఆత్మపరం గావించు. ఇంద్రియాలను ప్రేరేపించే మనస్సు కట్టబడినప్పుడు ఇంద్రియ వ్యాపారాలు అణగారిపోతాయి. అప్పుడు..

ఆ.వె॥ మనసు విముఖమైన భావంబు నొందిన
బాహ్యజగతి నీకు బదయరాదు
సృష్టియెల్ల మనసు సృజనాత్మకంబను
'సత్య స్ఫురణ' నీకు నిత్యమగును.

మనస్సంటే ఏమిటో ఇంకొక రకంగా కూడా చెప్పవచ్చును. మనస్సు అంటే 'సంస్కారముల సముదాయం'. సంస్కారము లంటే మనుష్యునకు వాని 'ప్రారబ్ధకర్మ' వలన ప్రేరేపించ బడిన 'వాసనలు'. వాని వలననే సంకల్ప వికల్పములు జరిగి కోరికల రూపంలో పరిణమించి 'నేను, నీవు' అనే భేద భావం కలుగుతున్నది.



ఒకరిని నొప్పించుట ఒకరిచే బాధింపబడుట. దానివల్లనే జరుగుతున్నది. వీటికతీతమైన "విజ్ఞాని' లక్షణమేమంటే గుణదోషములకతీతమైన 'స్థితప్రజ్ఞత' కలిగి యుండటం. అటువంటి వానికి విహిత కర్మలే ఉండవు. అయినా అతను తన కర్తవ్యంగా ధర్మాచరణ చేస్తూనే ఉంటాడు.

అందువలన వాసనల ప్రోలైన మనస్సు వాసనలు సమసిపోతేగాని అది నశించదు.

ఇది సాధించడానికి ఒకమార్గం ఉన్నది. ముల్లుగుచ్చుకొంటే ముల్లుతోనే తీయాలిగాని వేరొక దానితో రాదు కదా! ప్రతికూల వాసనలను వృద్ధిచేసి మొదట జనించిన వాసనలను లాగివేయాలి. తరువాత క్రమంగా ప్రతికూల వాసనలను కూడా రూపుమాపాలి.

శ్రీకృష్ణుడట్లనగానే ఉద్ధవుడు 'సర్వసంగ పరిత్యాగమును' బోధించే సన్యాసం గురించి ఇలా ప్రశ్నించాడు. "స్వామీ! ఎంతకాదనుకొన్నా దేహాభిమానాన్ని పరిత్యజించుట అంత సులభం కాదుకదా! నాలాంటి అల్పులకు కూడ సుసాధ్యమైన



దారిచూపు. త్రిమూర్తులలో సర్వశ్రేష్ఠుడవైన నారాయణుడవు గనుక నీవెనాకు సర్వేశ్వరుడవై జ్ఞానభిక్ష పెట్టాలి. సరైన దారి చూపాలి అని ప్రార్థించాడు.

అంత శ్రీకృష్ణపరమాత్మ చిరునవ్వులొలికించి "నాయనా! ఉద్ధవా! ఏమిటీ వెర్రితనం? ఈ ప్రపంచంలో ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి. ఇక్కడ గురువు ప్రకృతే అని తెలుసుకో. లోకంలో చరాచరాల తత్త్వాన్ని పరిశీలించి యుక్తాయుక్తాలను నిశ్చయించి యుక్తాల నవలంభించి క్రమక్రమంగా సిద్ధిపొందాలి.

దానికొరకు ఈలోక స్వభావమేమిటో బాగా అర్థంచేసుకోవాలి. ప్రత్యక్షంగా చూసింది మాత్రమే మనస్సుకెక్కగలదు. కొన్నింటిని 'అనుమానప్రమాణం' వలన గ్రహించవచ్చును. దూరంగా పొగకనబడుతుంటే అనుమాన ప్రమాణం ద్వారా అక్కడ నిప్పు ఉండి ఉంటుంది అని ఊహించవచ్చును. ఈ రెండు ప్రక్రియలు ఎవరికి వారే చేసికొనవలెను. ఒకరు పొగని చూచి వేరొకరు నిప్పుని నిర్ధారణ చేసికొనజాలరు.



ఊహించినది ఆత్మనిశ్చయానికి తోడ్పడదు. అందుకే గురువు కేవలం ఇది-అది అని విడమరచి బోధించగలడు కాని అంతకు మించి సహాయం చేయలేదన్నాను. ఎవరెంతచక్కగా బోధించినా స్వానుభవానికి సాటిరాదు".

అప్పుడు తిరిగి ఉద్ధవుడిలా అన్నాడు. "స్వామీ! మనస్సు జడపదార్థమైతే దానికి గ్రహణ శక్తి, బోధనా శక్తి ఎలా కలుగుతున్నవి?"

శ్రీకృష్ణుడిలా అన్నాడు. "ఉద్ధవా! ప్రారబ్ధకర్మల వాసనల యొక్క సముదాయమే మనస్సని తెలుసుకొంటివి కదా! నీవన్నట్లు అది జడమే కాని శుద్ధమై యుండునప్పుడు మురికిలేని అద్దము చక్కటి ప్రతిబింబాన్నిచ్చినట్లు ఆత్మసాన్నిధ్యంవలన సత్యాన్ని మాత్రమేగోచరింపచేస్తుంది."

మళ్ళీ ఉద్ధవుడు "స్వామీ! లోకాన్ని మించిన గురువు లేదన్నావుకదా! అసలు లోకమంటే ఏమిటి?" అని అడిగాడు.

పరమాత్మ ఇలా జవాబిచ్చాడు. "నాయనా! చరాచరాత్మకమైన సమస్త సృష్టిని లోకమంటారు. తేనెలోని

**మాధుర్యంవలె ఈ సృష్టి అంతా అవినాభావంతో నేను వ్యాపించి, నిండియున్నాను. భూమి, నీరు, గాలి, వెలుగు, ఆకాశము అను పంచభూతముల విచిత్ర కలయికవల్ల సర్వసృష్టిని సృజించుచున్నాను. అందుచే నేను పంచభూతాత్మకుడను".**

ఉద్ధవుడు తిరిగి ఇలా ప్రశ్నించాడు.

"స్వామీ! ఏకము, అద్వితీయము అయిన పరమాత్మ నుంచి వచ్చిన సృష్టిలో నానాత్వం ఎలా కలిగింది?"

శ్రీ కృష్ణుడిలా అన్నాడు **"జీవుల ప్రారబ్ధ కర్మ బహువిధంబులుగా నుండుటవలన అవి అనుభవించుటకు వాటి ఉపాధులు కూడా రకరకంబులుగా నుండవలెను. అందుచే సృష్టిలో నానాత్వం కలిగినది. అయితే అన్ని ఉపాధులలోకి ఆత్మ దీప్తిసులభసాధ్యమైన మానవ ఉపాధి మాత్రం బహుజన్మల పుణ్యఫలం. మనుష్య శరీర నిర్మాణం దాదాపు ఒకేలా ఉండవచ్చు కాని వాడి మానావమానాలు మాత్రం వాడి ప్రారబ్ధకర్మవలననే కలుగుతున్నాయి.**



**నిద్రాహార భయమైథునములను నాలుగు దాదాపు ప్రతిజీవికీ సహజమే ఐనను, ఆత్మ జ్ఞానజ్యోతిగా వెలిగియుక్తాయుక్త వివేచన, మోక్షమందభిలాష కలుగు మానవ జన్మ ఉత్తమోత్తమమైనది.**

ఉ॥ అన్నిటికన్న మిన్నయగు నయ్యది మర్త్యునిదౌ
ఉపాధియే
ఎన్నగ నాత్మదీప్తమగుటెంతయొ తేలిక దాని
యందునన్,
'మన్ను' తనుండియున్ మెరుపు బాయదు 'అద్దము',
'కుండ' యట్టిదా?
ఎన్నియొహీనజన్మములనెత్తిన ఆత్మకు దక్కు
నద్దియున్



**"ఉద్ధవా! ఏకపాద, ద్విపాద, త్రిపాద, చతుష్పాద బహుపాద జీవులు నా అనేక ఉపాధులలో ఎన్నో ప్రాణులున్నా మోక్షార్హత గల మానవజన్మమే ఉత్తమోత్తమము"** అన్నాడు భగవానుడు.

తిరిగి ఉద్ధవుడిలా ప్రశ్నించాడు. **"స్వామీ! చరాచర సృష్టినంతా వ్యాపించి యుండే నీరూపాన్ని ఎలా తెలుసుకోవాలి?"**

పరమాత్మ ఇలా అన్నాడు. **"ఉద్ధవా! నా రూపం స్థూలదృష్టికి అందదు. బుద్ధీంద్రియంతో గ్రహించగలవు. కానీ దానికి తగినంత సాధన కావలెను. బుద్ధీంద్రియం జడపదార్థమనీ దానికి స్వతంత్ర గ్రహణశక్తి లేదనుకోవటం పొరబాటు మరిసాధనచేసే వారెవరు? జీవుడే. అతడే** సాధనవల్ల పరమాత్మరూపం గ్రహించగలడు.



## అవధూతయదు సంవాదము

ఉద్ధవునితో శ్రీకృష్ణపరమాత్మ ఇంకా ఇలా అంటున్నాడు. **"ఉద్ధవా! లోకమే ఉత్తమ గురువు అని నేననదానికి కారణం అవధూతోపాఖ్యానం ద్వారా వివరిస్తాను విను. ఇది మన వంశపూర్వీకుడైన యదుమహారాజునకు మరియు అవధూతకు మధ్యజరిగిన సంవాదము. మన వంశపూర్వీకుడైన నహుషునికి, యయాతి, ఆయనకు యదువు జన్మించారు. ఆ యదువు వల్లనే మనమందరము యాదవులమయ్యాము.**

ఆయన ప్రజారంజకంగా పరిపాలిస్తున్న రోజుల్లో **ఒకనాడు తేజోవంతుడైన ఒక అవధూత రాజును చూడవచ్చాడు. అతని స్థితిగతులను విన్న యదుమహారాజు పరమాశ్చర్యచకితుడై అతనిని సందర్శించి వినయం ఉట్టిపడేలా ఈవిధంగా అడిగాడు.**

సీ॥ ఓమహాత్మా! నాకు ఉనికి రాకున్నది

నీవింత నడవడి, నీవెవరవు?

పిల్లవానిది తీరు, వెఱ్ఱివాడవు కావు

జడ లక్షణంబుల జాడలేదు

'ప్రజ్ఞ' మోమున తోపె బలహీనుడవు కావు

కామ, లోభంబులు గానరావు

నిత్యసంతోషంబు నెలవాయె నీలోన

దీని కారణమేది తెలియనైతి

తే॥ సుఖముగానున్న గజరాజు చూపునీది

ఎట్లు సాధించితివి నీవు ఇట్టి స్థితిని?

విషయవాసన తొలగిన విధమదేది?



నీ మహానంద కారణంబేమి స్వామి?

యదుమహారాజుతో అవధూత "రాజా! నాకు కూడ జీవితం ఎలా గడుపవలెనో తెలుసుకోవటం శ్రమతో కూడిన పని అయింది. చివరికి ఈలోకం కంటే ఉత్తమ గురువు లేడనే సత్యాన్ని గ్రహించాను. దానినే శుశ్రూషించి తత్ఫలంగా ఇట్టి స్థితిని పొందాను. నా గురువులెవరెవరు? వాళ్లవలన నేను నేర్చిన దేదో క్లుప్తంగా చెబుతాను ఆలకింపుము.

## 1.భూమి (క్షమాపరార్థ జీవితం)

"క్షమయా ధరిత్రీ'... అన్నారు పెద్దలు. భూమి ఓర్పుకి ప్రతీక. దానిని త్రవ్వి, నానారకాలుగా కలుషితం చేసినా ఎంతో ఓర్పుతో సహిస్తుందేకాని ఆగ్రహించి శిక్షించదు. తనలో రకరకములైన వృక్షములను పెంచి మనుష్యులకు ఆహారం, వస్త్రములు గృహ వస్తు సముదాయము జంతువులనుండి రక్షణ కల్పిస్తున్నవి. గొడ్డలితో నరికినా కిమ్మనక ఆ చెట్లు మనిషికి మేలే చేస్తున్నాయి. ఆ భూమిపైనున్న పర్వతములు తాము తడుస్తున్నా ఇంకా వర్షము నుంచి బాటసారులను రక్షిస్తుంటుంది. పర్వతాలు నదులు ప్రవహించడానికి



హేతువులు. బుద్ధిమంతులు భూమినుంచి పరార్థ జీవితము, సర్వసమానత్వము, ఓర్మి నేర్వవలెను.

## 2. వాయువు (జీవిత నిర్వాహకత్వము)

వాయువును చూచి నేనెట్లు జీవించవలెనో నేర్చుకొన్నాను. దేహము యొక్క శుద్ధాశుద్ధములతో ఆత్మకు పనిలేదు. ఆత్మ సర్వాంతర్యామియై వివిధ పార్థివ దేహాలలో ఉన్నా ఆత్మకు దేహస్థితిగతులతో పనిలేదు. వాయువు అన్నిచోట్ల ఉన్నా ,దానికి సువాసన దుర్వాసనలతో పనిలేదు.

ప్రాణవాయువు జీవికి అత్యవసరమే కాని ఎంత కావాలో అంత వాయువే ప్రాణికి అక్కరకొస్తుంది. అట్లే మనం ఎంత అవసరమో అంతే భుజించాలి కాని కనపడినదల్లా తింటే అనర్థమేనని వాయువును చూచి నేర్చుకొన్నాను.

శీతోష్ణాది నానా విషయ ధర్మాలతో వాయువుకి పనిలేదు. దానినుంచి నిస్సంగత్వం నేను నేర్చుకొన్నాను.



## 3. ఆకాశము (ఆత్మపరిచ్ఛేద్యత)

ఉ॥ ఆకసమెట్టిదో కనుము అయ్యది 'పాత్ర'

అదేదియైననున్

చేకొని దానిరూపమును చిత్రముగా తనునిండి

అంతటన్

ఏక విధంబుగా నమరు; ఇన్ని ఉపాధులనున్న

ఆత్మయున్

ఏకము వేఱుకాదనుచు ఏను నెరింగితి

ఆకసంబుచే

## 4. జలము (సహజస్నిగ్ధ నిర్మలస్వభావం)

నీరు స్వాభావికంగానే స్వచ్ఛమై, స్నిగ్ధమై, మధురమై యుంటుంది. తనను సేవించినవారినందరినీ పునీతులను చేస్తుంది. మనుష్యుడట్లే నిర్మల స్వభావంతో సహజ స్నిగ్ధ రూపుడై అందరికీ ప్రీతిపాత్రుడై తను పవిత్రుడై అన్యులను పవిత్రం చేస్తూ జీవించాలి అని నీరు నాకు గురువై బోధించింది.

## 5. అగ్ని (నిసర్గ ప్రకాశాదులు)

అగ్ని నిసర్గ ప్రకాశమానము. అది ఒక్కొక్కప్పుడు నివురుగప్పియుండును, మరొకప్పుడు ప్రజ్వరిల్లుచుండును. జాగరూకులై ఆశ్రయించిన వారికి వేడిమినిచ్చి ఉపకారము చేయును. అజాగ్రత్త పరులను దగ్ధము కూడ సేయకలదు. కాని నిష్పక్షపాతబుద్ధితో వ్యవహరించును. హితులకు మేలు పరులకు కీడు సేయదు.

పాపుల దేహములను కూడ సమానముగ సంస్కరించు అగ్నిని చూచి సమవర్తనము నెరుంగవలెను. తను హవిస్సుని గ్రహించి నిష్పక్షపాతంగా దేవతలకు ఇస్తుంది కాని తానయి కోరిగ్రహించదు.

అగ్నివలె మునివర్యులు కూడ పరేచ్ఛతో ప్రేరేపితులై అన్నాదులను గైకొనవలెను కాని తామే స్వయంగా కాంక్షతో గైకొనరాదు.

అగ్ని దానిలో వేసిన పుడకలను బట్టి వృద్ధి క్షయాలు పొందుతుంది కాని 'వహ్ని' మాత్రం ఏకరాశిగా ఉంటుంది. అదే విధంగా దేహానికి పుట్టుక వృద్ధి క్షయాలుంటాయి కాని



ఆత్మకుండవు. మనకి అగ్ని ఈ సత్యం సద్గురువువలె బోధిస్తున్నది. ఆత్మకు వలెనే అగ్నికి కూడ రూపంలేదు. ఏ దేహంలో ఉంటే ఆత్మ ఆ పేరుతో పిలువబడినట్లు ఏ పదార్థాన్ని అగ్ని దహిస్తే అగ్ని ఆయా ఆకారములను దాల్చుతుంది. ఇవన్నీ బోధించే అగ్ని ఒక మంచి గురువు.

## 6. చంద్రుడు (ఆత్మ నిర్వికారత్వము)

చంద్రుని గమనించి నేనొక గొప్ప సత్యాన్ని గ్రహించ కలిగాను. చంద్రుడు శుక్లపక్షంలో క్రమంగా వృద్ధిజెంది పూర్ణుడై, కృష్ణపక్షంలో క్రమంగా క్షయమొంది అదృశ్యుడైనట్లు కనిపించినా నిజమునకు ఆవృద్ధి క్షయలు చంద్రకళలకే గాని చంద్రమండలానికి కాదు. అదేవిధంగా పుట్టుట పెరుగుట క్షయమొందుట, రోగగ్రస్తమగుట, నశించుట వంటి వికారములు ఉపాధియైన దేహమునకే గాని ఆత్మకు కావని చంద్రుని వలన గ్రహించితిని.

## 7. సూర్యుడు (ఆత్మ నిర్వికారత్వము)

సూర్యుడొక్కడే ఏకరాశిగా కనబడుతున్నా ఆ



బింబమును జూచు పలువురకు పలు విధంబులుగా కనబడుచున్నాడు.

**చం॥ దినకరుబింబమొక్కటియె తేకొని చూచిన**
**నీటిపాత్రలన్**
**కనబడు వేఱువేఱుగనె కన్నులముంగిట,**
**జిడ్డు నీళ్లలో**
**పనివడి కాంచినన్ మురికిబట్టిన సూర్యుడు**
**గోచరించుగా**
**కనుగొన ఆత్మకూడ పలుకాయములందున**
**దోచువేఱుగా**

దీనినిబట్టి ఆత్మ అద్వితీయము, ఏకము స్వచ్ఛము అయినప్పటికీ ఉపాధులనుబట్టి వాటి గుణములను బట్టి భిన్నములుగాను శుద్ధాశుద్ధ మిశ్రమముగాను గోచరించు చున్నదని గ్రహించగలిగితిని. అందుచే సూర్యుడు కూడ నాకొక గురువైనాడు.



## 8. పావురము (మమకారమే పతనద్వారము)

ఒక అడవిలో చక్కని పావురాల జంటకు ముద్దులొలికే కూనలు కలిగాయి. మురిపెంగా వాటికాహారం అందిస్తూ వాటిపై అనురాగపాశాబద్ధులై వాటి తోటిదే జీవితంగా ఆ పావురాలు బ్రతుకుతున్నాయి. ఒకరోజు ఆ జంట ఆహారం కోసం తమ గూటిలో పిల్లలను వదిలి పావురాలు బయటకు వెళ్ళాయి.

ఒక బోయవాడు వలవేసి ఆ పావురాల కూనలను పట్టుకున్నాడు. గూటికి ముందుగా తిరిగి వచ్చిన ఆడపావురం తన కూనల గతిజూచి దుఃఖతప్తయై తను కూడవలలోనే చిక్కువడి చావుకై నిరీక్షించింది. ఇంతలో ఆహారంతో తిరిగి వచ్చిన మొగ పావురం వెలవెలబోతున్న గూటిని చూచి వ్యాకులపడి ఆదాపునే వలలో చిక్కిన తన కూనలను వాటి తల్లిని చూచి వలవల దుఃఖించింది. తనవారు లేక తన బ్రతుకే వ్యర్థమనుకొన్నది. మమకార పీడితయై జీవితం వ్యర్థమనుకొన్నది.

ఆ.వె.॥ బ్రతికి లాభమేమి? ప్రీతిపాత్రులు లేక
మొండికట్టెవోలె మోదమగునె?
పావురంబు వగచి వలలోనె తను జిక్కి
కన్నుమూసె తుదకు కలతజెంది

కావున ఓ యదుమహారాజా! కుటుంబ లోలురైన వారు ఆ పావురాల జంటవలె వివిధ మమకారములకు లోనై బంధముల జిక్కి ద్వంద్వములకు లోనై చివరికి నశించిపోతున్నారు. ముక్తిద్వారమైన మానవజన్మ నీలోపూర్వ కర్మ పుణ్యప్రాప్తిచే లభించినది అని గ్రహించి పరమేశ్వరుని ప్రీతిపాత్రులే ప్రయత్నములను చేయక ఇంద్రియాసక్తులైనచో ఎంతటి వారికైన అధఃపతనం తప్పదని పావురమును చూచి నేను నేర్చితిని.

## 9. అజగరము (కొండచిలువ)
## (యధాప్రాప్త సంతృప్తి)

ఒక అడవిలో రెండు తలల అజగర మొకటి నివసిస్తుండేది. అది ఆహారంకోసం ఏ ప్రయత్నము చేయక తననోటికి చిక్కిన జంతువులను మాత్రమే అదే ప్రాప్తమన్నట్లు



భక్షించి కడుపునింపుకొనేది.

దానిని చిరకాలం గమనించి నేనొక గొప్పపాఠం నేర్చుకొన్నాను. ప్రారబ్ధ కర్మచే చావు నిర్ణయింపబడిన జంతువులు ప్రయత్నము చేయకనే దాని నోటిలోబడి నశిస్తున్నాయి. ప్రాప్తమున్నది ఏ ప్రయత్నము చేయకనే నీకు భుక్తమవుతుంది. ఏది, ఎంత, ఎప్పుడు, ఎలా ఎక్కడ ప్రాప్తమో ఈశ్వరునిచే నిర్ణయింపబడి దొరుకుతవి గాని వెంపర్లాడితే దొరకవు. దొరికిన దానితో తృప్తిజెంది బ్రహ్మోన్ముఖుడై యున్న వానికి అన్నీ ఆ పరమేశ్వరుడే ఇస్తాడని అజగరము నుంచి నేర్చుకొన్నాను.

## 10. సముద్రము (నిర్వికల్ప స్థితి)

సముద్రము అగాధమై, ప్రసన్న గంభీరమై, నిస్తరమై (దాటుటకు వీలులేనిదై), చోరరానిదై, తుది తెలియలేనిదై ఉంటుంది. మనుష్యుడు కూడ సాగర గంభీరుడై రాగద్వేష రహితుడై, రత్నాలయమైన సముద్రమువలె జ్ఞాన నిధియై యుండవలెను.



నదులెన్ని కలిసినా చెలియలికట్టను దాటని సముద్రమువలె ఎన్ని భోగ్యవస్తువులు సంప్రాప్తించినా నరుడు పొంగిపోరాదు. ఏదైనా కారణంచేత నదుల కలయిక ఆగిపోయినా సముద్రములో నీరు మాయమైపోదు. అలాగే మనిషి తను కోరుకొన్నవి లభించనప్పుడు 'ఎండిపోకూడదు'. నిర్వికారంగా నిరంతరం నారాయణ స్మరణతో నిర్వికల్ప స్థితిలో ఉండాలని సముద్రమును చూచి నేను నేర్చుకొన్నాను.

## 11. శలభము (సంసారకూప పతనం)

చం॥ శలభము జూచి నేర్చితిని చక్కగ, తాను
భ్రమించి కాంతిలో
సలసల కాగి వేడిమికి చచ్చుటె దక్కును
ఇంద్రియంబులన్
గెలువని అల్పుడెప్పుడును కీర్తిని గాంచడు
భావనీరధిన్
విలవిలలాడు జవ్వనుల ప్రేమయె సర్వమ
నంచు యెంచుచున్



శలభము అనగా మిడత. అది వెలుతురును చూచి భ్రమించి చేరుటకు ప్రయత్నించి, ఆ వేడికి తట్టుకోలేక ప్రాణాలను పోగొట్టుకొంటుంది. అట్లే ఇంద్రియవశుడైన (దైవమాయవలన) అల్పుడు స్త్రీ అనే మంటను చూచి దాని హావభావములకు ఆకర్షితుడై, అదే సుఖదాయకమని భ్రమించి వెంటనే అగాధమైన సంసారమను కూపములో పడి నశిస్తున్నాడు. ఇది శలభంనుంచి నేను నేర్చిన గుణపాఠం.

## 12. మధుకరము (గుణ గ్రహణము)

తుమ్మెద ఒక్క పువ్వునందే తగిలి యుండదు. ప్రతిపూవుపై వాలి కొంచెము మాత్రమే మకరందం స్వీకరిస్తూ నిత్యం పరిభ్రమిస్తుంటుంది. అట్లే యోగి ఏదో ఒక్క ఇంటిని ఆశ్రయించి ఉండక మధుకరవృత్తితో ఇంటింటికి ఒక్కముద్ద ఆహారమును మాత్రమే స్వీకరించి గొప్ప బీద తారతమ్యము లెంచక జీవితాన్ని గడపాలి. అట్లాగే యోగి ఎక్కడెక్కడ గుణముంటే (సద్గుణం) అది గ్రహించాలి. ఎవరినీ విమర్శింపరాదు.

## 13. ఏనుగు (ఆసక్తి దోషం)

ఏనుగు ఎంత బలవంతమైన జంతువో అంత వ్యామోహపీడితమైన జంతువు. ఆడ ఏనుగు కనబడగానే అది కామపీడితమై దారి చూసుకోకుండా దాని వెంటబడుతుంది. దారిలో దానిని పట్టుకొని బంధించ దలచిన వారు గడ్డి కప్పియుంచిన ఒక పెద్ద గోతిలో పడేట్లు చేసి మగ ఏనుగును బంధిస్తారు. స్వాతంత్ర్యం కోల్పోయి ఆ మగ ఏనుగు జీవితాంతం బానిసవలె బ్రతుకుతుంది. అందుకే భిక్షువు ఆడబొమ్మను సైతం తాకరాదు. పొరబాటునైనా ఆడగాలి సోకితే ఏనుగువలె చెడిపోతారని గ్రహింపవలెను.

## 14. మధుహారి (సంచయ ఫలం)

చం॥

చనిప్రతిపూవునుండి వడి చౌర్యము సేయుచు పూలతేటినిన్
అనువుగ కూడబెట్టనది అన్యుల పాలగు దొంగిలించగా
తను తినకుండ ఆర్తులకు దానము నీయక దాచిబెట్టినన్
వెనుక అదంతపాడగును 'వెర్రి'ని మానుడు నేర్పె 'తుమ్మెదల్'



## 15. మృగము (జింక) (ఇంద్రియ వివశత్వం)

చక్కటి వేణునాదానికి వివశమైన జింకలు పారిపోవుట కూడ మరచి వీనులవిందుగా వింటూ వేటగాళ్లకు బందీలవుతాయి. జిహ్వా చాపల్యంతో తినరానివి తినకూడనంత తిని అనారోగ్యంచే మరణిస్తారు. ఇంద్రియ వివశులై నీతిబాహ్యులై జారులై అధోగతిపాలవడం లోకంలో సహజమే. శరీర సుఖం. దుఃఖహేతువు. మృగములనుంచి నేనెన్నో పాఠాలు నేర్చాను.

## 16. మత్స్యము (చేప) (ఆశాపరత్వం)

**ఆ.వె.॥ జిహ్వాపెట్టు క్షోభ చెప్పలేనిది సుమా!**
**'ఎర' కు జిక్కి చచ్చితీరు చేప**
**అంతమీయు తుదకు ఆశాపరత్వంబు**
**నేర్చినాను చేప నీతి దెలుప**



## 17. పింగళ (నైరాశ్యము)

రాజా! పూర్వం విదర్భ దేశంలో పింగళ అనే అందమైన వేశ్య ఉండేది. తనకులాచార ప్రకారం పడుపు వృత్తితో జీవిస్తున్న ఆమె బాగా ధనం సంపాదించసాగింది. హడావిడిగా ఉండే ఆమె ఇల్లు ఒకరోజు విటులెవ్వరూ లేక వెలవెలబోయింది. రేయి గడిచిపోతున్నా ఆమె చెంతకెవ్వరూ రాలేదు.

నిరాశకు లోనయిన పింగళ వివేకంతో ఆలోచించటం ప్రారంభించింది. నేనెందుకు నిరాశ చెందుతున్నాను? ధనం కోసమా, సుఖం కోసమా? సుష్టుగా తిని చక్కగా అలంకరించుకోవటమే సుఖమైతే నేనది చేస్తూనే ఉన్నాను కదా! ధన సంపాదన ప్రధాన లక్ష్యం కూడా సుఖజీవనమే కదా! వేశ్యకు ధనం ఏకీర్తిని తెచ్చిపెట్టగలదు?

నిజానికి తను విటులకు సుఖమిస్తున్నదే కాని ఏసుఖం పొందుతున్నది? సుఖం కోసం నన్ను ఆశ్రయించినవాడు నాకేం సుఖం ఈయగలడు?



అసలు సుఖం అనుభవించేదెవరు? నా దేహమా? దేహమంటే ఈ తోలు సంచియా? అది జడపదార్థమే కదా! రక్త మాంసం ఎముకలు ఉన్న ఈ శరీరం ప్రతిదినమూ వయసు పెరిగి ముసలిదయిపోతూనే ఉన్నది. పళ్లుకూడా ఊడి బోసినోరు అయ్యే ఈ దేహం ఎల్లకాలం విటులను ఆకర్షించకలదా?

ఒక్కరోజు స్నానం చేయకపోతేనే కంపుకొట్టే ఈ శరీరం కోసం భ్రాంతితో జీవితం అంతా పాడుచేసికొన్నాను కదా! ఎంత అవివేకిని! భ్రాంతి కలిగిస్తున్నదేమిటి? మనస్సు. మనస్సుకు ఇటువంటి ఆలోచనలెలా కలుగుతున్నాయి? ఆశాప్రేరితం అవటం వలన ఆలోచనలు కలుగుతున్నాయి. ఈ ఆశకు అంతం ఉన్నదా? ఒక కోరిక తీరితే వెంటనే ఇంకొక కోరిక కలిగే ఈ మనస్సు ఆశను విడిచి పెట్టటం జరిగే పనేనా? తృప్తికలుగుట అనేది సాధ్యమా?

మరి గత్యంతరమేమిటి? ఎవరినో ఆలోచన అడిగేకంటే నా అంతరాత్మనే అడుగుతాను. కాని నా అంతరాత్మ నా అవివేకానికి నన్ను గేలిచేస్తుందా? చేస్తేచేయనీ. ఇన్నాళ్ళూ

నాఅంతరాత్మ చేసిన హితబోధ పెడచెవిని పెట్టాను. ఇకనైనా తెలివి తెచ్చుకొంటాను. ఎంత తెలివి తక్కువదాన్ని.

పోనీ ఇంద్రియ సుఖాలైనా శాశ్వతాలా అంటే కాదు. ఆ సుఖం కూడా చివరికి దుఃఖంగానే పరివర్తన చెందుతున్నది. మరైతే శాశ్వత సుఖం అనేదే లేదా? అసలు కాలానికి కట్టుబడి అశాశ్వతులైన మర్త్యులు శాశ్వత సుఖం ఈయగలరా?

కాబట్టి శాశ్వతుడొక్కడే శాశ్వత సుఖమునీయగలడు. చరాచర, సమస్త భూతజాలములను వాటి కర్మానుసారం కర్మఫలాల నందించి వాటిని నడుపుతున్న వాడొక్కడే నిరవధికమైన అఖండ సుఖప్రాప్తినందించగలడు.

ఆయన శాశ్వతుడేగాక అఖండ సుఖప్రదాత. ఆయన భగవంతుడు గనుక తన తప్పులన్నీ క్షమించగలడు. ఇక ఆయననే ఆశ్రయించెదనుగాక!

ఓహో నేనెంత భాగ్యవతిని? ఏదో జన్మలో సర్వేశ్వరుని ఆరాధించి ఉండాలి. అందుకే నేడు నాకు జ్ఞానోదయమై భగవదారాధనపై బుద్ధి జనించింది. అది ఏనాడో చేసిన పుణ్యఫలమే.



సంసార కూపంలోబడి సుఖాలరూపంలో ఉన్న పాముకాట్లకు గురైన తల్లడిల్లి పరమాత్మ తప్ప ఉద్ధరించగలవారు లేరని గుర్తించలేక ఎవరో ఉద్ధరిస్తారని ఎదురు చూడటం ఎంత అవివేకం!

కనుక రాజా! ఆవిధంగా ఆమె కృతనిశ్చయురాలై దురాశను విడచి, శాంతిని పొంది, హాయిగా నిద్రించింది. ఆశ కాల సర్పం వంటిది. అది సోకితే నిరాశ అనే పాముకాటు తప్పదు. ఆశని జయించుటచే సమస్త సుఖ బీజమని పింగళతో పాటు నేనూ గ్రహించాను.

## 18. కురరము (లకుముకిపిట్ట)

ఒక కురరవపక్షికి (లకుముకి పిట్టకు) ఒకనాడు ఒక మాంసపు ముక్క దొరికింది. అపేక్షగా దానిని తినదలచినది. అది చూచిన మరొక రెండు లకుముకి పిట్టలుదానిని కాజేయవలెనని ఆ పిట్టవెంటబడ్డాయి. వాటిని తప్పించుకోవటానికి అది నానా యాతనలు పడి అనేకచోట్లకు పారిపోయింది. కాని వాటిని తప్పించుకోలేక అలసి నీరసించి ఆ మాంసం ముక్కను జారవిడిచింది. దాని శత్రువులు దానిని



విడిచిపెట్టి ఆ మాంసం ముక్కను దక్కించుకొని పారిపోయాయి. లకుముకి పిట్ట బ్రతుకు జీవుడా అనుకొన్నది.

**కం॥ విడువక మమకారంబును**

**అడుగడుగు అన్ని నాకు అమరుటకొరకై**

**గడిపితి దినదిన గండము**

**విడిచిన సుఖమందు ననుచు విశదంబాయెన్**

## 19. పసిబాలుడు (పరమానందం)

పసిపాపలకు 'లోకజ్ఞానం' శూన్యంకనక తరతమబేధాలు ఉండవు. చింత అంటే ఏమిటో ఎరుగరు. చింత ఎప్పుడు లేదో అప్పుడు పరమానంద ప్రాప్తి కలుగుతుంది. రోజులు గడుస్తున్న కొద్దీ గుణములు వాడి నాక్రమించి ఆశల సుడిగుండంలో పడద్రోసి, సుఖానికి దూరంచేసి, పరమానందంలో ఉన్న ఆ చిన్నారిని పరమ నికృష్టుడుగా మారుస్తాయి. అట్లా మారనివాడుంటాడా?

ఉంటాడు. వాడే గుణాతీతుడు. వాడు గులకరాయికి



బంగారు కణికకు భేదం చూడడు. వానికి ఈ చరాచరలోకం శూన్యప్రాయం. రాగద్వేషాలు వానికుండవు. వానిలో పరమాత్మ మాత్రమే భాసించుటచేత, నిత్యం నిరవధికమైన సుఖానుభవంలోనే మునిగి ఉంటాడు. అట్టి యోగి పసిబాలునివలె పరమానందం అనుభవిస్తూ గుణాతీతుడై ఉంటాడు. పసిబాలుని నుంచి నేనీ పరమసత్యం గ్రహించాను.

## 20. కన్య (వివిక్త సేవత్వం)

ఒక కన్యను వివాహమాడవలెనని తగిన యువకుల తల్లిదండ్రులు తరచుగా ఆమె తల్లిదండ్రుల వద్దకు వస్తూ పోతూ ఉండేవారు. ఒకనాడు ఆమె తల్లిదండ్రులు లేని సమయంలో ఎవరో ఆమెను చూడవచ్చారు. వారి ఎదుట బడుట ఆమెకిష్టంలేదు. ఆ సమయంలో ఆమె వడ్లు దంచుతున్నది. ఇంట్లో ఆడువారున్నట్లు ఆ ఆగంతకులకు తెలియరాదని ఆమె అనుకొన్నది. వడ్లు దంచుతుంటే చేతిగాజుల ధ్వనివల్ల తన ఉనికి తెలుస్తుందని ఆమె చేతికి రెండు గాజుల చొప్పున ఉంచుకొని తక్కినవి తీసివేసి వడ్లు దంచసాగింది.

ఈసారికూడ గాజుల చప్పుడు అత్యల్పంగా

వినపడసాగింది. ఆమె మళ్ళీ ఆలోచనలో పడింది. ఈ చప్పుడు కూడ వినపడకూడదంటే రెండు గాజులు కాక, చేతికి ఒక్క గాజే ఉండాలని తెలుసుకొన్నది.

అట్లే ఒక్క గాజుతో తన ఉనికిని మరుగు పరచుకొన్నది. దీనిని చూచి ఓ రాజా నేనొక సత్యం గ్రహించాను. నలుగురున్నచోట కలహము తప్పదు. ఇద్దరున్నచోట వాదోపవాదములు తద్వారా వేర్పాటు తప్పవు. ఏకాగ్ర చిత్తంతో నేను భగవచ్ఛింతనతో గడుపవలెనంటె ముందు సంగత్వం విడనాడవలెను.

## 21. విలు విద్యాభ్యాసకుడు (యోగాభ్యాస క్రమం)

రాజా! విలు విద్యాభ్యాసకుని గమనించి నేనొక సందేశం తెలుసుకొన్నాను. అతను తనగురిమీదె మనస్సు దృష్టి కేంద్రీకరించి బాణం తన లక్ష్యాన్ని ఛేదించునట్లు చేస్తాడు. అతనా నిబద్ధత కోలుపోతే తన లక్ష్యాన్ని తాకలేడు.

మనస్సు నిలకడ చెందాలంటే దానిలో ఉదయించే విపరీత భావాలను అణగించాలి. ఆ భావాలు రజోగుణం



వృద్ధిచెందటంవల్ల కలుగుతాయి. రజోగుణాన్ని అదిమి ఉంచితే సత్త్వగుణం వృద్ధి చెందుతుంది. అది క్రమంగా శుద్ధ సత్త్వగుణముగా మారి బాహ్య అంతః ప్రపంచములనుండి మనస్సుకు విముక్తి కలిగిస్తుంది. సుఖదుఃఖాది ద్వంద్వములనుండి విడివడి మనస్సును ఆత్మ నిష్ఠయందు కుదురుకొనునట్లు చేస్తుంది.

దీనిని యోగ పరిభాషలో ఆసన జయం, శ్వాస జయం, మనోజయం అంటారు. మనస్సు తగిలించుకొన్న వాసనలవల్ల దానికి మనోవిక్షేపం గుదిబండలా మారి మనోజయం నశించి తత్ఫలితంగా మనిషిని భగవంతునికి దూరం చేస్తుంది. అందుకే సుషుప్తిలో కర్మవాసనలు నశించి మనస్సు తాత్కాలికంగా 'లయ'మైనా అది భగవంతునియందు లగ్నం కావటంలేదు. రజోగుణం విక్షేపానికీ, తమోగుణం 'లయా' నికి హేతువులు.

అందుకే వాసనలు నాశనమైనంత మాత్రాన మనోలయం జరుగుటలేదు. మనోలయం జరిగితేనే మనస్సు చేసే కార్యాలు నశిస్తాయి. అప్పుడే వృత్తి శూన్యమై మనస్సు 'బ్రహ్మాకారిత' మవుతుంది. దీనినే యోగ పరిభాషలో 'సంప్రజ్ఞాత సమాధి' అంటారు.



## 22. సర్పము (అనికేతప్రమత్తాదులు)

సీ॥ అనికేతనుండయి అప్రమత్తుండయి
ఏకచారిగ "మౌని" ఇమడవలెను
తన 'గొప్ప' చాటక, తక్కువ మాట్లాడి
ఆడంబరములేక అమరవలెను
గొప్ప జీవితమూని గొనరాదు వాసంబు
నీడన్న చోటునే నిలువవలెను
నగరవాసంబులు నరకప్రాయంబగు
సర్పంబు నేర్పె నీ జ్ఞానమంత

తే॥ ఒరులగూడదు బ్రతుకును బొరియలందు
పరమజాగ్రత్త కదియొక! 'మారుపేరు'
అతి రహస్యంబు సర్పపు గతులు కూడ
నేను రాజా! ఇదంతయు నేర్చితిటుల,



## 23. ఊర్ణనాభము (సాలెపురుగు) (సృష్టి స్థితిలయలు)

రాజా! సాలెపురుగుని అనుసరించి నేను సంశయాల నన్నింటిని తొలగించుకొన్నాను.

సాలెపురుగు దాని ఇష్టంవచ్చినప్పుడు నోటిగుండా సన్నని దారమువంటి పదార్థమును బయటకు విడుస్తూ, లోపలికి పీల్చుకుంటూ ఉంటుంది. ఆ తంతువును బయటకు విడిచినప్పుడు దాని బరువు తగ్గుటగాని, తంతువును లోనికి పీల్చుకొనినప్పుడు బరువు పెరుగుటకాని జరుగుట లేదు. తంత్రులు సాలెపురుగు కాదు. కాని అవి సాలెపురుగునుంచి వచ్చి మళ్ళీ సాలెపురుగులోకే పోతున్నాయి. తంత్రులు సాలెపురుగు ఒకదానిని విడచి ఇంకొకటి లేవు.

అట్లే ఈజగత్తు పరమాత్మనుంచి వచ్చి పరమాత్మలోనే లయం అవుతున్నది. అంతమాత్రాన జగత్తే ఆ పరమాత్మ అనలేం. పోనీ భగవంతునితో సంబంధం లేనిది అనుకొందామా అంటే అది వచ్చింది ఆయననుంచే. అందుకే ఆయనను విడిచి జగత్తులేదు. జగతి ఉనికే ఆయన ఉనికిఅని

ప్రతిపాదిస్తోంది. వృద్ధి క్షయ జగతికే గాని జగన్నాధునికి లేవు.

సాలెపురుగునుంచి ఎప్పుడు ఎంత తంతి వచ్చిందో చెప్పటం ఎలా సాధ్యంకాదో ఈ సృష్టి భగవంతుని నుంచి వచ్చినా ఎప్పుడు ఎలా వచ్చిందో ఎన్ని జీవులు వచ్చాయో చెప్పటం సాధ్యమయ్యే పనికాదు. తంతువు యొక్క సృష్టి స్థితి లయకు ఊర్ణనాభం సాక్షీభూతం మాత్రమే. అది అల్లిన సాలెగూటిలో ఎన్ని కీటకాలు చిక్కుకుంటాయి. ఎన్ని మరణిస్తాయి. దానికి సంబంధం లేదు.

ప్రపంచం అనే సాలెగూటిలో ఎన్ని జీవులు ఎలా నశిస్తున్నది జగన్నాధునికి నిమిత్తం లేదు. తంతువు దానిలోకి వెళ్ళి ఉనికినే పోగొట్టుకొనినట్లు ఈ సృష్టి తిరిగి ఆ పరమాత్మలోనే లీనమై ఉనికినే కోల్పోతుంది.

ఉన్నంతకాలం, సృష్టి భగవంతుడు రెండూ సత్యమే. కాని లయమైనప్పుడు ఎవరినుంచి సృష్టి వచ్చిందో ఆ పరమాత్మ ఒక్కడే సత్యం. కాని అజ్ఞాని మాత్రం ఎదురుగా కనబడుతోంది కనుక లోకం (సృష్టి) ఒక్కటే సత్యం నాకంటికి కనబడని



దైవం అసత్యం అనుకుంటాడు.

మరి ఆ పరమాత్మ ఈ సృష్టిని ఎందుకు చేసాడు? ఎందుకు శ్రమపడి నిర్వహిస్తున్నాడు. ఇన్ని చేసినవాడు మళ్లీ వ్యర్ధంగా లయం చేస్తున్నాడు. వేదాలు ఉపనిషత్తులు కూలంకషంగా అధ్యయనం చేసిన మహానుభావులు కొంతవరకు ఈ శేషప్రశ్నకు జవాబివ్వటానికి ప్రయత్నించారు.

నైకోరమతే – అని బృహదారణ్యకోపనిషత్తు అంటున్నది. అనగా ఒంటరిగా ఎవరూ రమింపజాలరు అని దాని అర్ధం. ఒంటరిగా ఆ పరమాత్మ కూడా ఆనందంగా ఉండలేక కాలక్షేపానికో మరిదేనికో సృష్టిని ఆరంభించి నిర్వహించాడు. అందువల్లనే జగత్తు సృజించబడింది.

అయితే మనం సృష్టిని నిరసించాలా?ఎలా? సృష్టి ఆవలకి వెళ్లి నిరసించడం సాధ్యమయ్యే పనికాదు. సృష్టిలేని చోటేలేదు కదా! సృష్టిలోనే ఉండి దానితో జోక్యం పెట్టుకోకుండా ఉండటమూ సాధ్యమయ్యే పనిలా కనిపించడంలేదు. చరాచర జీవకోటిని ఆవరించుకొనే ఈ సృష్టి అంతా నడుస్తున్నది. మరెలా? ఈ సృష్టిలోనే ఉంటూ



తామరాకు మీద నీటిబొట్టులా, అంటీ ముట్టనట్లుండాలి. ఆ రహస్యాన్ని గ్రహించటమే జ్ఞానం అంటారు.

జ్ఞానుల వర్తన పైకి (బాహ్యదృష్టికి) ఈ లోకాన్ని ఆశ్రయించుకొని ఉన్నట్లే కనిపించినా మనస్సులో భగవంతునితోనే రమిస్తూ, జగతిపై ఉదాసీనులై ఉంటారు.

జ్ఞాన మనోనేత్రంతో మాత్రమే పరమాత్మను చూడగలం అన్నదే సత్యం. బాహ్యచక్షువులకు ఆయన అగోచరుడు. కాబట్టి లేదు అనే వారికి ఎలా చెప్పినా అర్ధంకాదు.

భగవంతునికి ఉపాధియేలేదు. కాని అన్ని ఉపాధులు ఆయనవే. బీజంలో మహావృక్షమున్నట్లు అవ్యక్తంలోనే ఆయన సర్వవ్యాపకుడై ఉన్నాడు.

అగ్నికి రూపం ఉన్నదా? అది దేనినాక్రమిస్తే దాని రూపమే అగ్నిపొందినట్లు భగవానుడు ఏ ఉపాధిని ఆశ్రయిస్తే అదే ఆయన ఆకారం. భగవంతుని అవతారాల రహస్యం అదే. అందుచేత విశ్వం భగవంతుడు కానప్పటికీ ఆయన ఆకారమే. మరి పరమాత్మయొక్క అవ్యక్తరూపం ఎట్లాంటిది. అది చెప్పటం సాధ్యమయే పనికాదు. వాక్కుకీ బుద్ధికీ కంటికీ గోచరించని



దానిని నిర్వచించడం తేలికకాదు. గ్రహించడం గ్రహించిన దానిని వివరించడం ఇంద్రియములు చేసేపనులు. అతీంద్రియమైన విషయాన్ని ఇంద్రియాలతో వివరించడం అసాధ్యం. అందుకనే భగవానుని అవాఙ్మానస గోచరుడని అంటారు.

## 24. కీటకము (తత్సారూపము)

రాజా! తుమ్మెద ఒక పురుగును తెచ్చి తనగూటిలో ఉంచి దానిచుట్టూ భ్రమిస్తూ ఉంటుంది. ఆ పురుగు భయంవలన ప్రతిక్షణం ఆ భ్రమరంపై దృష్టి నిలిపి నిరంతరం దానినే చూస్తూ ఉంటుంది. అట్లు కొన్నాళ్ళు గడిచాక తదేక ధారణ వలన ఆ కీటకమే భ్రమరమై ఎగిరిపోతుంది.

కనుక మనస్సు దేనియందు 'నిర్వికల్ప సమాధి' పొందుతుందో చివరికి జన్మ ప్రాప్తించినప్పుడు ఆ రూపమే దక్కుతుంది. నీచుల గురించి తలుచుకొంటూ దేహం వదలినవారు తిరిగి ఆ నీచ జన్మమే పొందుతారు. ఉత్తమమైన దానిని గురించి ధారణ చేస్తే ఉత్తమ జన్మ కలుగుతుంది.

అయితే జీవితమంతా వ్యసనాలలో గడిపినవాడు. అంత్యకాలమున ఒక్కసారిగ ఈశ్వర ధ్యానంలో మనస్సు నిలపాలంటే జరిగే పనికాదు. నిరంతర భగవద్ధ్యాసలో ఉన్న వారికైనా అంత్యకాలంలో మనస్సు అరిషడ్వర్గాలకు లోనై ద్వేషభావంతోనే తనువు చాలించవచ్చు. అదంతా ఈశ్వరుని కృప.

నిరంతరం శ్రీహరిని ద్వేషిస్తూనే మరణంలో కూడ విష్ణు ధ్యాసలో వైకుంఠం పొందిన దానవులకు లెక్కేలేదు. కనుక ధారణ మిత్రత్వం వలన కలిగినా శతృత్వం వలన కలిగినా భగవంతునిపై ధారణే ప్రధానం.

**చం॥ తనువును వీడువేళ మనధ్యాస నిలంబడబోదు**
**శ్రీహరిన్**
**మనమున నిల్ప వీలవదు, మానక ఆ భగవాను**
**చింతలో**
**అనవరతంబు ఈ బ్రతుకు అంతమ జెందిన**
**సాధ్యమద్దియున్**
**విను 'గురు కీటకం' బటుల పెట్టెను జ్ఞానపు**
**భిక్షనో నృపా!!**



తన 24 మంది గురువుల గురించి ఆ విధంగా యదు మహారాజుకు చెప్పిన అవధూత చివరికి తన అనుభవ సంగ్రహాన్ని ఆ రాజుకిలా బోధించాడు.

రాజా! జీవితకాలంలో తన భోగం కోసం అనేక సౌకర్యాలను సేకరించటానికి పడరాని పాట్లు పడి చేయరాని తప్పులు చేసి ఎంతో ధనాన్ని పరివారాన్ని వస్తుసముదాయాన్ని ప్రోగుచేసినా ఇదంతా దేహపతనం వరకే. ఒక్కసారి శరీరం నుంచి జీవుడు లేచిపోయాక ఈ కట్టెని వదిలించుకోవాలని చూసేవారేగాని ఒక్క నిముషం కూడ దీనిని తమతో ఉంచుకోరు.

దశ ఇంద్రియాల 'సంగత్వంతో' జీవించిన వాడు పదిమంది భార్యల మొగుడిలా బావురుమంటూనే నలిగి నశిస్తాడు. ఇట్టి మానవ దేహాన్ని త్యజించుదామా అంటే తత్త్వ విచారణ తత్ఫలమైన 'బ్రహ్మానందం' కూడా ఈ శరీరం వలన మాత్రమే సాధ్యము. పైగా ఆత్మహత్య చేయరాని మహాపాపం, అందుచే స్వధర్మంగా దేహాన్ని కాపాడుకొనక తప్పదు.

రాజా! జన్మములన్నిటిలోను జ్ఞానార్జన చేయగల మానవ జన్మయే అత్యుత్తమమైనది. భగవత్సంకీర్తన చేయగల శక్తి ఒక్క



మానవునికే ఉన్నది.

భగవంతుడు భక్తికి వశమైనట్లు మరే ఇతర సాధనానికి లొంగడు. వివేకాన్నిచ్చి గొప్ప అవకాశం కల్పించిన భగవానుని ఈ మానవ దేహంతో శరణుకోరి ఆయన చింతనలో గడపక భోగలాలసుడవటం కృతఘ్నుతే గాక క్షమార్హం కాని నేరం. కనుక భగవంతుని తప్పక పూజించవలెను. పూజ అంటే బండెడు పూలు ఆయనపై 'విసరటం' కాదు. మనస్సు అనే పుష్పాన్ని ఆయనకు సమర్పించి శరణాగతితో ఆయన ధ్యాసలోనే బ్రతకాలి.

కర్తవ్య నిర్వహణలో అలసత్వం పనికిరాదు. మోక్షసాధన కేవలం మానవకాయంతోనే సాధ్యం. కేవలం శరీర సుఖం ప్రధానమైతే ఏ శరీరమైనా ఒకటే నరజన్మ ఒక్కటే అవసరం లేదు.

రాజా! వైరాగ్యం సంపాదించి, అహంకారాన్ని విడనాడి, ముక్తిని సాధిస్తే ఆత్మ సంస్థితి నొంది ఈ జగమంతా సంచరిస్తుంటాను. ముక్త సంగుడను కాబట్టి దేనిపైనా నాకు మమకారం ఉండదు.



పూర్ణజ్ఞానం ఒక్కసారి కలిగేది కాదు. జ్ఞానాన్ని మధుకరవృత్తితో లోకంనుంచే సంపాదించాలి. చిత్తశుద్ధి ఉంటే ఏకాగ్రత, దానివల్ల జ్ఞాన సముపార్జన సాధ్యమవుతాయి. అట్టి బుద్ధితో భగవత్సేవ చేసిన వారికి ఆ మహనీయుని పూర్ణావస్థ సిద్ధిస్తుంది.

ఈ విధంగా యదు అవధూతల సంవాద రూపంలో అవధూతోపాఖ్యానం ముగించి శ్రీకృష్ణపరమాత్మ ఇంకా ఇలా అన్నాడు.

**భగవత్ ప్రపత్తి :**

ఉద్ధవా! భగవంతుని ఆశ్రయించడమంటే ఆయన ప్రతిపాదించిన ధర్మాన్ని పాటిస్తూ వర్ణాశ్రమ ధర్మాన్ని ఫలాభిసంధి రహితంగా ఆచరించడం. స్వధర్మానుచరణమే సర్వ శ్రేష్ఠమైనది. ఇంద్రియ తృప్తి కోసం కాక నిష్కామ కర్మగా కర్తవ్యమాచరించవలెను.

మనం పొందే కష్టసుఖాలు మనం ఇప్పుడు చేస్తున్న కర్మ పర్యవసానాలుగా కనిపించినా అవియన్నీ ప్రారబ్ధ కర్మలే. ఈ జన్మలోని సిధ్య సిద్ధులు. ఇప్పటి ప్రయత్నాలకి లోబడినవి కావు. పూర్వజన్మ కర్మఫలానుసారంగా ఈ జన్మలో అనుభవార్థం

కలుగుతాయి. వాటిని తప్పించటం అసంభవం. ఈ జన్మలో ఒక ప్రయత్నం, ఒక వ్యక్తి ద్వారా మనకు మేలు జరిగినట్లు కనిపించినా ఆ వ్యక్తి తన ఋణానుసారమే ఆ ప్రయత్నంతో మనకి మేలు చేస్తున్నాడని గ్రహించాలి. అలాగని నిద్రబోతే పనులు వాటంతట అవి జరగవు. మానవ ప్రయత్నం తప్పక చేయాలి. అట్లుచేసి సహన భావంతో భగవదేచ్ఛ అని స్వధర్మాన్ని చక్కగా ఆచరించాలి.

**సత్యాసత్యవివేకము :**

ఉద్ధవా! మానవులు మేలుకొని ఉన్నప్పుడు, నిద్రించునపుడు తమున్న స్థితులు కాక సుషుప్తిలో స్వప్నావస్థను కూడ పొందుతున్నారు. స్వప్నంలో జరుగు సంఘటనలన్నీ తాత్కాలికంగా నిజమని భ్రమ కలిగినా జాగరూకతయందు స్వప్నం భ్రాంతి అని తెలుసుకొంటారు. దాన్నిబట్టి ఇంద్రియ గోచరమైన దృశ్యాలన్నీ నిజాలు కావని తెలిసి పోతుంది.

ఏది ఆ మూడు అవస్థలలోను యధాస్థితిలో ఉంటుందో అదే సత్యం. మిగిలినదంతా అసత్యం. సత్యంకాదు అన్నంత మాత్రాన ఉనికే లేదని కాదు. ఉనికి బహు తాత్కాలికమని



అర్థం. ఒకడు 'ముద్దులొలికే బాబు' అన్నమాట నిజమే కావచ్చు. అది తాత్కాలికమైన నిజం. కొన్నిసంవత్సరాల తరువాత అది నిజం కాదు. ఎందుకంటే వాడు బాలుడే కాదు, యువకుడు. అందుకని క్షణక్షణం మారిపోయే మానవ జీవితంలో అన్నీ అసత్యాలే, తాత్కాలిక సత్యాలు. తాత్కాలికమైన వాటికోసం సర్వకాలాల్లో సత్యమైన భగవంతుని వదులుకోవటం నిజంగా మూఢత్వమే కదా!

**కర్మము:**

ఉద్ధవా! సృష్టి జరుపు 'వ్యాపృతి'ని కర్మము అంటారు. బ్రహ్మామునుంచే కర్మ మొదలవుతుంది. ఇది ఎప్పుడు ప్రారంభమయిందోచెప్పటం సాధ్యంకాదు. బ్రహ్మ సంకల్పంతోపాటే కర్మము ప్రారంభమయింది.

ఈ వ్యాపారం ప్రవృత్తి పరమైనప్పుడు జనన మరణాలరూపంలో సంసారం రూపుదిద్దుకొంటున్నది. సంసారఫలం అవుతున్నది. అదే నివృత్తిపరమైనప్పుడు మోక్షఫలం అవుతున్నది. అంటే నిష్కామవ్యాపారం జరుగుటకు జ్ఞానంకలగాలి. అది సాధన ద్వారా క్రమక్రమంగా సిద్ధించేదే



తప్ప ఒక్కసారే ఎవరికీ సాధ్యంకాదు. జగచ్చక్రమంతా కర్మము వలనే నడుస్తున్నది.

కర్మము ప్రాణికోటికి స్వభావ సిద్ధం. స్వభావానికి విరుద్ధంగా నడుచుకోవటం అసాధ్యంకదా! ఒకవేళ అలా చేద్దాం అనుకొన్నా స్వభావం అలా చేయనియ్యదు. కర్మము ఎటువంటిదయినా ఏదో ఒక దోషం ఉండక మానదు. అంతమాత్రాన కర్మను త్యజించుట హితవుకాదు.

నిజానికి అసలు దోషం కర్మమునందులేదు. దానిని చూసే బుద్ధిలో ఉన్నది. ఫలమునాసించి కర్మచేయుటలో దోషమున్నది. తలారి ప్రభుత్వ ఆజ్ఞననుసరించి ఒక వ్యక్తిని 'ఉరి' తీసినా అతను నిష్కాముడు గనుక అతనికి పాపం అంటుకోదు. కర్తవ్య కర్మలకు నైష్కర్మ్య సిద్ధి కలిగి పాపం అంటుకొనదు.

**స్వభావం** : ఉద్ధవా! ఎవరి స్వభావమైనా వారి ప్రారబ్ధఫలానుసారంగా శుద్ధస్వభావమని, మిశ్రమ స్వభావమని, అశుద్ధ స్వభావం అని మూడు విధాలుగా ఉంటుంది.



శుద్ధ స్వభావం నైష్కర్మ్య సిద్ధికి దోహదం చేస్తుంది. మిశ్రమ స్వభావంలో శుద్ధతత్త్వం పాలు ఎక్కువగా ఉన్నప్పుడు శాస్త్రజ్ఞానం, గురూపదేశం, సజ్జన సాంగత్యం తోడ్పడి ఎప్పుడో ఒకప్పుడు సత్కర్మలు చేయటానికి దోహదపడి తీరుతుంది.

ఇక అశుద్ధ స్వభావంతోనే చిక్కువస్తున్నది. ఎందుకంటే సంపూర్ణమైన అశుద్ధ స్వభావం ఉండదు. అతి స్వల్పంగానైనా అశుద్ధ స్వభావంలోని శుద్ధ స్వభావం వాణ్ణి తాత్కాలికంగా కొంతసేపు సత్కర్మ చేయ ప్రేరేపిస్తుంది. అంటే ఆ వ్యక్తి భగవంతునివైపు తిరిగాడన్నమాట. ఇక ఆవైపు అడుగులు వేయడమే తరువాయి. ఆ ఉద్ధరణ కూడ క్రమక్రమంగా జరుగుతుంది.

ఉద్ధవా! ఇక్కడ ఒక్కమాట గుర్తుంచుకోవాలి. నా భక్తులైన వారికి గర్వము, మాత్సర్యము ఉండకూడదు. వారు కార్యదక్షులై ఫలాపేక్షారహితులై ఉండాలి. వారి హృదయంలో ప్రేమరసం నిరంతరం జాలువారుతుండాలి. వారికి తొందరపాటు పనికిరాదు. తత్త్వార్ధ జ్ఞానమును సంపాదించుటలో తీవ్రమైన అభిలాష ఉండవలెను. మనస్సులో అసూయకు ఎంతమాత్రము

తావుండరాదు. ఏమాత్రమూ, ఏవోవ్యర్థాలాపాలతో కాలం వెళ్లబుచ్చరాదు. ఏ ఆత్మ తనలో ఉన్నదో అదే ఇతరులలోన ఉన్నదని గ్రహించి అందరియందు సమదృష్టితో మెలగవలను. ఉదాసీనుడై వ్యవహరించవలెను.

**మాయ :**

**సీ॥ కాలరూపుండనై ఇల సుఖదుఃఖాల**
**పరిమితి విధియించి జరుపుచుంటి,**
**జీవరూపుండనై జీవుల సుఖదుఃఖ**
**భోక్తగా గొనుచుంటి పూర్తిగాను**
**తోపినేను స్వభావ రూపిగా జీవుల**
**దేహత్వభావంబు తెలుపుచుంటి**
**ధర్మరూపునిగ నందరి పూర్వ పుణ్యాల**
**ఫలముగ ఇత్తును స్వర్గప్రాప్తి**

**తే॥ మాయశక్తి నధిష్టించి చేయుచుంటి**
**అన్ని పనులను ఉద్ధవా! అందుచేత**
**మాయ ఇదియని ఎరుగరు మానవాళి**
**మాయ అనునది నా శక్తి మహిమ సుమ్మి!**



**మయాతరణోపాయం :**

ఉద్ధవా! నామాయను దాటడం అంత సులభం కాదు. నాకు ప్రవృత్తిని గావించిన వారు మాత్రమే నామాయను దాటగలరు. అట్టి వారి హృదయాలలోనే నేను జ్ఞానజ్యోతిని వెలిగిస్తాను. అట్టివారికే అజ్ఞానం పటాపంచలవుతుంది. వారికి జ్ఞానోదయం కలిగి లోకం స్వస్వరూపంలో గోచరిస్తుంది.

మాయ, తత్ఫలమైన లోకం–ఈరెండు కూడ మిథ్యలే. మిథ్యఅంటే అభూత కల్పన అని కాదు. అవి నాకంటే అన్యమైనవి కావు అని తెలుసుకో. దేనికి ఉత్పత్తి కారణాన్ని ఊహించలేమో దాన్నే 'అనాది' అంటున్నాం. మాయను 'అనాది' అని చెప్పటం వ్యావహారికమే కాని పారమార్థికం కాదు. కాని మాయ నేను వేరు వేరు అని చెప్పితే పరమాత్మనైన నేను ఏకము అద్వితీయము కాదనే భావన వస్తుంది. కనుక మాయ నేను వేరువేరుకాము.

అంటే నన్ను తెలుసుకోవటానికి ఉపయోగపడిన జ్ఞానం నన్ను తెలుసుకొన్నాక తన ఆవశ్యకతనే కోల్పోయింది. 'కతక



రేణువు' ను నీటిలో వేస్తే అది నీటిలోని ముఇరకిని నశింపజేసి చివరికి తానుకూడ నశిస్తుంది.

అదే విధంగా జ్ఞానం అజ్ఞానాన్ని రూపుమాపి తనుకూడ ఉనికిని విడిచివేస్తుంది.

**మాయ–అవిద్య :**

మాయ అనేది శుద్ధ సత్త్వగుణం. కాని అవిద్య అట్లాకాదు. అవిధ్య మాత్రం రజస్తమస్సుల కలయిక వలన మలినమైన సత్త్వం. అవిద్యే జీవులకు ఉపాధి భూతం. మాయ అన్నది బ్రహ్మము చేత అధిష్ఠితమైయున్నది. అందువలన జీవుడు ఉపాధి పొందినవాడని బ్రహ్మము ఉపాధే లేనివాడని స్పష్టమవుతున్నది.

కనుక బ్రహ్మమొక్కటే సత్యము. మనకు జగత్తులో కనిపిస్తున్న నానాత్వం అంతా మిధ్య.

**చార్వాకమతము :**

జీవులంతా ఒకరింకొకరు ఏమీ కారని వేర్వేరని అన్నిటిలోనూ



ఉన్నది. ఒకే ఆత్మ అయితే వేర్వేరు భావాలతో వేర్వేరు స్థితిగతులతో వేర్వేరు శక్తి సామర్థ్యాలతో తర్కానికి విరుద్ధంగా అనుభవానికి కూడా అందని జీవ పరిణామం ప్రకృతివల్ల జరుగుతున్నది కాని పరమాత్మ అని ఎవరూ లేరని వాదించేవారే చార్వాకులు. వారు సర్వం స్వాభావికం అంటారు.

సుఖమే పరమ తాత్పర్యం. సుఖపడాలంటే స్వాతంత్ర్యంకావాలి. దేహానికి పుట్టుక, వృద్ధి, తరుగుట, నశించుట అనునవి సహజమే కాని ఎవ్వరి పురాకృత కర్మవలన కాదు. భగవంతుడెవరో ఉన్నాడని స్వాతంత్ర్యంలేక జీవిస్తే సుఖమెలా కలుగుతుంది? సుఖ సాధనమైన శరీరమే లేనినాడు ఇక ఆనందమేమిటి? నిత్యానందమేమిటి? ముక్కుమూసుకొని సన్యాసుల్లా బ్రతికి సాధించేదేమిటి? అని వీరు వాదిస్తారు.

**సుఖ విచారము**: ఉద్ధవా! అసలు సుఖమంటే ఏమిటి? ఇష్టం వచ్చినట్లు సౌకర్యాలతో బ్రతుకుట అని మీమాంసకులు వాదిస్తారు. వారు ఆలోచిస్తున్నది ఇంద్రియసుఖం. ఇంద్రియాల బిగువు సడలగానే ఆ సుఖం దుఃఖమే కదా! ముదుసలి, యువతులతో సుఖించలేడు కదా!

'సార్వకాలికం' గాని సుఖం ఏమి సుఖం? గొర్రెను కసాయివాడు ఈడ్చుకొని పోవునట్లు మృత్యువు కబళిస్తుంటే తల్లడిల్లే స్థితి సుఖమా? దుఃఖమా? సర్వావస్థలలోను అపరిమితమైన ఆనందం అనుభవిస్తూ ఉండటమే నిజమైన సుఖం అంటే. వానికి మృత్యుభయం ఉండదు. వాడే **మృత్యుంజయుడు.**

అసలు మృత్యువు ఎవరికి కలుగుతున్నది? దేహానికి దేహంలో ఉండే జీవికి (కూటస్థునికి) కలుగుటలేదు. ఈ రహస్యం తెలుసుకొన్నవాడు నిత్యానందుడు. అదే మృత్యువుని జయించటమంటే. జీవుడు పరమాత్మ యొక్క అంశయే కనుక వాడికి చావు పుట్టుకలు లేవు. అందుకనే జీవుని 'ప్రత్యగాత్మ' అని పిలుస్తారు.

ఉద్ధవా! ఇహలోకంలో ఏదీ శాశ్వతం కాదని తేలిపోయినది కదా! పోనీ పరలోకమైనా శాశ్వతమా అంటే అదీ కాదు. స్వర్గమైనా మరే లోకవాసమైన కాలపరిమితి కల నివాసాలే. మళ్ళీ ఈ భూమిపై పుట్టుక తప్పదు.



చచ్చేవాడికి పుట్టుక, పుట్టేవాడికి చచ్చుట తప్పవు. ఏదీ శాశ్వతం కాదు. పరమాత్మనైన నేనూ ఈ 'రాకపోకలు' చేస్తూనే ఉన్నాను. ఐతే నా రాకపోకలు నా ఇచ్ఛానుసారం జరుగుతాయి. జీవుల రాకపోకలు వారి కర్మానుసారం జరుగుతాయి.

ఇంద్రియాలు జడములే, కాని సూదంటు రాయి ఇనుపముక్కను ప్రభావితం చేసి, దానికి ఇనుప సూదులను ఆకర్షింపజేయునట్లు జీవుడు జడమైన దేహాలను ప్రభావితం చేసి చైతన్యవంతం చేస్తున్నాడు.

**బంధవిముక్తి తత్త్వ విచారం**

ఉద్ధవునికి భగవానునికి ఈ విధంగా సంవాదం జరిగింది.

"స్వామీ! దేహమున్నంతకాలం దానికి గుణములు కూడ ఉంటాయి కదా! దేహస్థుడైన జీవుడు ఆ గుణములకు బద్ధుడు కాక తప్పదు కదా? అటువంటప్పుడు, జీవుడు గుణకార్యాలనుంచి తత్ఫలితాలయిన సుఖదుఃఖములనుండి ఎలా ముక్తుడవుతాడు?"

"మిత్రమా! గుణములు మాయ మూలకాలు. మాయ



అంటే మిధ్య. కనుక గుణములు కూడా మిథ్యే. కావున గుణములచే ఏర్పడిన బంధన, ముక్తులు కూడ మిధ్యలే. అజ్ఞానమున్నంతకాలం జీవుడు బద్ధుడే సుమా! జ్ఞానోదయం వలన అజ్ఞానం నశిస్తుంది. దానితో అజ్ఞాన జనితమైన భ్రమలు కూడ తొలగిపోతాయి. దానితో భ్రాంతి తొలగిపోతుంది."

"స్వామీ! బద్ధులకు, ముక్తులకు భేదమేమిటి?"

"మిత్రమా! తమ నిజమైన ఆత్మస్వరూపం తెలియని వారంతా బద్ధులే.తమ నిజస్వరూపం ఆత్మస్వరూపమని తాత్కాలికంగా ఒక దేహాన్ని ధరించినా, ఈ దేహం క్షణభంగురమని తెలిసినవాడు నిత్యముక్తుడు".

"స్వామీ! భగవంతుని మాయకు అంతమున్నదా?"

"ఉద్ధవా! జ్ఞానాజ్ఞానములు రెండూ మాయా కార్యములైన స్థితులే. మాయ అంటే పరమేశ్వరుని అనిర్వచనీయమైన శక్తి. పరమేశ్వరునికి ఆద్యంతాలు లేవు, కాని మాయకు అంతమున్నది.

"స్వామీ! పరమాత్మకు జీవాత్మకు భేదం ఏమిటి?"

"మిత్రమా! ఆకాశంలో సూర్యుడొక్కడే ఉన్నా వేర్వేరు



నీటికుండలలో వేర్వేరు సూర్యబింబాలు కనిపించినట్లు పరమాత్మ ఒక్కడే వేర్వేరు దేహాలలో వేర్వేరు జీవాత్మలుగా ప్రతిఫలిస్తున్నాడు. కుండలో నీరు కదలినప్పుడు సూర్యుడు కదలినట్లు తోచినా ఆ కదలిక భ్రాంతియే. జిడ్డు నీటిలో సూర్యుడు మలినంగా కనిపించినా ఆయనకే మలినమూ లేదు. అట్లే ఆత్మకే ఉపాధి మాలిన్యమూ అంటదు. ఆత్మ ప్రకాశానికి ఉపాధి మాలిన్యాలు అడ్డు పడవు. ఆ మాలిన్యాలు ఆత్మకు అంటనే అంటవు. ఎన్నో కుండలలో సూర్యబింబం కనిపిస్తున్నా ఏదో ఒక కుండలో నీరు కారిపోతే ఆ ఒక్క కుండలోనే సూర్యబింబం కనిపించదు. అలాగే ఏ ఉపాధిలోంచి జీవుడు నిష్క్రమిస్తే ఆ ఉపాధి శవం అవుతుంది. తక్కిన కుండలలో సూర్యుడుకనబడ్డట్లే తక్కిన ఉపాధులలో జీవాత్మ ఉంటుంది. సూర్యుడు మాత్రం పరమాత్మలా వెలుగొందుతూనే ఉంటాడు. దానివల్ల ఆత్మకు స్వపర భేదముండదని తెలుస్తోంది. "స్వామి! బద్ధులకు ముక్తులకు జీవన విధానంలో తేడా ఏమిటి?"

"ఉద్ధవా! ఒకచెట్టుమీద రెండు పక్షులున్నాయి. ఒకటి ఆ చెట్టుకి పండుకాయగానే భుజించేది. ఇంకొకటి పండును తాకకుండా

చూస్తూ సంతోషంగా ఉండేది. భుజించే పక్షి పెద్దపండు తియ్యటి పండూ దొరికినప్పుడు సంతోషంగాను చిన్నపండు వగరు పండు దొరికినప్పుడు దుఃఖపడుతూనే ఉండేది. రెండవ దానికి చింతయే లేదు. ఎందుకంటే అది ముక్తం గనక. మొదటి దానికి సుఖము దుఃఖము ఒకదాని తరువాత ఇంకొకటి వస్తూనే ఉన్నాయి. అది ఎప్పుడూ బద్ధాత్మగానే ఉండేది. నాయనా! ఈ ఉదాహరణలో విశ్వమే నేను చెప్పిన మహావృక్షం. జీవులలో ఉండే రెండురకాలవారు రెండు పక్షులకు ప్రతీకలు. ఫలాభిలాషలేని జీవుడు ముక్తుడు. ఫలాభిలాష ఉన్న జీవుడు బద్ధుడు.

ఈ విధంగా సంవాదరూపంలో బంధవిముక్తి తత్త్వాన్ని వివరించాడు పరమాత్మ.

**బంధముక్తుల భావభేదము:**

బంధము, ముక్తి అను ఈ రెండును మానసిక స్థితులే.



**ఆ.వె.॥ జరుగుచున్నదెల్ల నెరపుచున్నది నేనె**
**మదిని తలచునటుల 'బద్ధజీవి'**
**సాక్షిభూతుడేను జరుపు నింద్రియములు**
**తలచు 'ముక్త సంగుడి'లను ఇటుల**

**బద్ధ, ముక్తిని బాహ్యలక్షణములు:**

శరీరాభిమానం ఉండదు కాబట్టి ముక్తుడు తన శరీరానికి కలుగుతున్న పూజావమానములు తనవి కావని భావిస్తాడు. బద్ధునికి శరీరాభిమానం మెండు కాబట్టి శరీరానికి కలిగే సుఖ దుఃఖాలన్నీ 'నావే' అనుకొని సంతోషం, ఏడుపు పొందుతుంటాడు.

**ముక్త్యావస్థ ద్వయము**

ఉద్ధవా! బద్ధుల గూర్చి విన్నావు కదా! ఇక ముక్తుల గూర్చి వినుము. వీరు రెండు రకములుగా నుందురు. వ్యుత్థావస్థగల ముక్తులు ప్రపంచ జ్ఞానం ఛాయామాత్రంగా కలిగి ఉంటారు. వారికి రాగద్వేషాది ద్వంద్వములుండవు. ప్రపంచాన్ని



సాక్షీమాత్రంగా చూస్తుంటారు. సమాధ్యవస్థ గల ముక్తులు ప్రపంచ జ్ఞానమే ఉండని నిత్య ఆత్మారాములై ఉంటారు. ముక్తుల లోకవర్తనమంతా తామరాకుపై నీటిబొట్టువలె ఉంటుంది.

ఎప్పుడేది ఎంతైన అయాచితంగా లభిస్తే దానితోనే తృప్తిజెంది, పోగేసి దాచేసుకోవటానికి విముఖుడై ఉంటాడు. ముక్తుడు. ఏదీ దొరకని నాడు చింతపడడు. దేనినీ కోరడు అతని చర్యలు ప్రాపంచిక దృష్టిలో "పిచ్చి" చేష్టలవలె కనిపిస్తుంటాయి. అతనే పనైన ఈశ్వర ప్రేరకం అన్నట్లే చేస్తాడు.

**అనుష్ఠానం ప్రాధాన్యత:**

"స్వామీ! అనుష్ఠానం యొక్క ఆవశ్యకతేమిటి" అని ఉద్ధవుడడిగాడు.

పరమాత్మ ఇలా బదులిచ్చాడు. "ఉద్ధవా! వేదాలలో ప్రతిపాదించబడిన తత్త్వాన్ని గ్రహించి, ఎవ్వరికేది అన్వయిస్తుందో దానిననుసరించి, స్వానుభవ సిద్ధం



చేసుకోవడాన్నే 'అనుష్ఠాన'మంటారు. అనుష్ఠానంతో జతకలియని వేదాధ్యయనం, పాలు పితకని ఆవు, పతివ్రతకాని భార్య, అపాత్రునికి చేసిన దానం, పరాధీనమైన శరీరం, దుర్మార్గుడైన కుమారుడు వ్యర్థమైనవి. అవి

దుఃఖహేతువులు.

**శ్రవణానుష్ఠానం:**

**ఆ.వె.॥ దేని నేర్పవలెనొ దాని తాత్పర్యంబు**
**పెద్దవారి కూడి వినుట వలనొ**
**శాస్త్ర పఠన గూర్చు జ్ఞానంబు వల్లనో**
**సరిగ నిశ్చయించ, శ్రవణమంద్రు.**

**"మననం" ద్వారా అనుష్ఠించుట :**

ఉద్ధవా! విన్న విషయము యొక్క సత్యాసత్యములను సాధక బాధక యుక్తులచే విమర్శించి అర్థంచేసికొనుటనే "మననం" అంటారు. జీవాత్మ పరమాత్మల మధ్య తేడా ఏమిటో ముందు తెలుసుకోవాలి.

చక్కటి సంగీతం వింటూ గాయకుని చూస్తుంటే కొంతసేపటి ఆ గొంతు వినపడుతుందే కాని గాయకుడు కనబడడు. నీ కళ్ళూ, చెవులు రెండూ పని చేస్తున్నా మనసు మాత్రం తనకు కావలసినది చెవి ఇచ్చే జ్ఞానమే కాని కనులు ఇచ్చే జ్ఞానం వద్దని గాయకుని రూపం చూపునుంచి 'కనుమరుగు చేసింది' అందుకె కనులు చూస్తున్నా మనసు చూడటం లేదు. మనసు ద్వార వినడం మాత్రమే చేస్తున్నవాడే నీలోని జీవుడు.

అదే సంగీతం కాసేపటికి నిద్రపడితే వినపడదు. అలా కాసేపయ్యాక ఎవరో గట్టిగా కేక వేస్తే మెలకువ వస్తుంది. ఇప్పుడు గాయకుడూ కనబడుతున్నాడు. పాటకూడ వినబడుతున్నది, ఎవరికి? ఇందాక కనబడలేదు, వినపడలేదు, ఎవరికి? కళ్ళు తెరిచి వున్నా గాయకుడు కనిపించలేదు. ఎవరికి? పాట మాధుర్యానికి ఆనందంగా తలఊపిందెవరు? వాడే జీవుడు "అబ్బ పది నిముషాలు ఏలోకంలో ఉన్నానో నాకే తెలియలేదు'' అనుకొంటున్నదెవరు? 'నేను' అనుకుంటాడు అజ్ఞాని. నేను కాదు నా 'ఆత్మ' అనుకొంటాడు జ్ఞాని.



అయితే ఈ జీవాత్ముడు నిద్రపోక పూర్వం, నిద్రలోనూ, నిద్రమేలు కొన్నప్పుడు – అంటే ఈ మూడు అవస్థలలోను కేవలం 'దృక్కు' మాత్రమే. వానికి శరీరానికుండే జనన మరణాలు లేవు. అతడు కేవలం 'ద్రష్ట'.దానినే 'చిదాత్మ' అని 'చిత్తు' అనికూడ అంటారు. సర్వసాధారణంగా దానినే ఆత్మ అంటారు. ఉపాధి గతమైనందువల్ల వ్యవహారం కోసం పరమాత్మకు ఈ ఆత్మకు భేదం ఉందంటున్నామే గాని ఈ ఆత్మ కూడ స్వయంప్రకాశ మానమే. స్వప్రకాశంతో సూర్యునివలె ఇతర వస్తువులను ప్రకాశింపజేస్తాయి. ఉదాహరణకి ఎన్నో దివ్యాత్మలను చెప్పవచ్చు.

అయితే ఈ జీవాత్మలనావరించి అంతఃకరణము అని ఒకటుంటుంది. అది ఆయా సందర్భాలలో చేసే పనులను బట్టి మనస్సు, బుద్ధి, చిత్తము అని చెప్పబడుచున్నది. ఈ అంతఃకరణము జడముగా ఉన్నది. ఇక్కడ జడమంటే చైతన్యశక్తి లేనిది అనికాదు అర్థం.

జడమంటే స్వయంప్రకాశమానం కానిది అని అర్థం. అంతఃకరణవే మంచి చెడ్డలను విమర్శించి



నిశ్చయించేటప్పుడు 'బుద్ధి' అని చెప్పబడుతోంది. అది కర్తృత్వం వహించి 'నేను' చేస్తున్నాను అనుకొంటున్నప్పుడు దానినే అహంకారం అంటున్నారు. పూర్వం జరిగిన విషయాలను గుర్తుచేసికొంటున్నప్పుడు దానినే 'స్మృతి' అంటున్నారు.

అది సంకల్ప వికల్పాత్మకమైనప్పుడు 'మనస్సు' అంటూ పిలుస్తున్నాము. అది కార్యకర్మానికి ప్రేరేపించినప్పుడు దానినే 'చిత్తము' అంటున్నారు.

ఈ గుణములన్నీ అంతఃకరణకు స్వతస్సిద్ధంగా వచ్చినవి కావు. అవి చిదాత్మ 'భాసించుట' చేత కలుగుచున్నవి.

అదే చిదాత్మ జడరూపంలో దేహభావం పొందుతున్నది. అహంకారం అను ఉపాధితో కూడి అవిభాజ్యంగా ఉన్నది. సూదంటు రాయి శక్తి దాని కతుక్కున్న ఇనుపముక్కకి వచ్చినట్లు దేహానికి ఆత్మవల్ల చైతన్యం వస్తుంటే ఈ దేహమే జీవి అనుకొంటున్నారు. ఆ భావాన్నే అజ్ఞానం అని గ్రహించాలి.

అహంకారానికి చిచ్ఛాయతోను, సాక్షిచైతన్యంతోను, దేహంతోను తాదాత్మ్య కలుగుతున్నది. అంటే ఏకీభావం



కలుగుతున్నది. ఈ తాదాత్మ్యం కూడ సహజము, కర్మజము అని రెండు విధములుగ నున్నది.

సహజతాదాత్మ్యము : ఉద్ధవా! ఎప్పుడైతే చిచ్ఛాయ, అహంకారం తాదాత్మ్యం చెంది 'నేను ఎరుగుదును' అనే భావన కలుగుతున్నదో అహంకారం కర్తృత్వంభావం అలవరచుకొన్నదని అర్థమైంది. దానినే సహజ తాదాత్మ్యం అంటున్నాము.

**కర్మజతాదాత్మ్యం :**

కర్మజతాదాత్మ్యం వలన నేను 'మనుష్యుడను' అని ఆ ఉపాధినే తానుగా భావించే తత్త్వం అలవడుతుంది. కర్మజతాదాత్మ్యం అంటే పూర్వకర్మ సిద్ధము, శుభాశుభ రూపము అయిన ఉపాధితో వర్తించు అహంకారము.

భ్రాంతి జన్యతాదాత్మ్యము : ఉద్ధవా! ఒకదానిని చూచి మరొక దానిగా భావించే అహంకారాన్ని భ్రాంతిజన్య అహంకారమంటారు.

**భక్తుల విభజనము :** ఉద్ధవా భగవంతుని అనుభవ

పూర్వకంగా తెలుసుకోవాలని జరిపే కృషినే భక్తి అంటారు. ఇది రెండు విధములు. పరాభక్తి మరియు అపరాభక్తి.

**పరాభక్తుడు :** ఇతనినే 'జ్ఞాని' అంటారు. ఉత్తమోత్తముడైన ఈ జ్ఞానికి నాకూ ఏ భేదమూ లేదు. భక్తి అంటేనే ప్రేమఫలం. ప్రేమకి ఇద్దరుండాలి కదా! ఒకరు ప్రేమించేవారు ఇంకొకరు ప్రేమించబడువారు. ఇలా ద్వైత భావనకు చోటీయక "సర్వమ్ ఏకం" అనే భావనతో నిశ్చయంతో ఇక ఆజ్ఞాని నాతో ఐక్య భావనతోనే వుంటాడు. అయితే పరాభక్తి నెలకొనటమే చాలాకాలం పట్టే వ్యవహారం. అందాకా జ్ఞానినే పరాభక్తుడని పిలుస్తున్నాం. జ్ఞానం కలిగాక అతనికి ఈశ్వరునికి అబేధమే.

అపరాభక్తుడు : వీరు నన్ను కొలిచే భక్తులు. ఉద్ధవా! వీరూ రెండు రకాలు. వారినే శుద్ధభక్తులు, జ్ఞానమిశ్రమ భక్తులు అంటారు.

శుద్ధభక్తుడు నా తత్త్వ విచారమే చేయడు. అతడు మనోవాక్కాయ కర్మలా నన్నే సర్వస్వమని ఆరాధిస్తాడు. పూజ, స్తుతి, నాకథాగానము, నా విభూతి మననము, నా



ధ్యానమున, నాకు దాసుడై సర్వం వాసుదేవమయం అనే భావనతో ఉంటాడు. నా ఆలయాలున్న దివ్యక్షేత్ర సందర్శనం చేస్తూ నియమ నిష్ఠలతో నా వ్రతముల నాచరించుచు, నా ఉత్సవములు జరుపుచూ ఉంటాడని నా పేరున దానధర్మములాచరించుట నా ఆలయములు నిర్మించుట, తాంత్రిక దీక్షలు చేబట్టుట, ఉద్యానవనములను నిర్మించుట, సంతర్పణలు అన్నదానములు చేయిస్తుంటారు. నా ఆలయాల్లో ఊడిగం చేసేవారు కొందరైతే నాకోసం బలులిచ్చేవారు కొందరు. వానికి ఆభిజాత్యం కాని, ఆడంబరం కాని, మానావమానాలు కాని ఉండవు. అట్టి ప్రియమైన భక్తుని స్థితిగతులతో నాకు ప్రమేయం లేదు. అతనికి ప్రియమైనవన్నీ నాకు ప్రియములే.

**జ్ఞానమిశ్రమ భక్తుడు** : వీరిని లోకవ్యవహారంగా సాధువులని కూడ అనవచ్చును. ఉద్ధవా! వారుపరమ కృపాలురై, చలిచీమలను కూడ చంపరు. సహనమూర్తులై, సత్యమే ప్రాణంగా పరోపకారమే ధ్యేయంగా, కామ స్పర్శలేకుండా శాంతము, మార్ధవము, శుచి, అంకిత భావంతో,



మితాహారులై నన్నే శరణని నాతోడిదే లోకంగా ఉంటారు. క్రమంగా వారు గుణదోషములను విడనాడి, శాస్త్ర నిబద్ధతను కూడా పరిత్యజించి, పరాభక్తునిగా మారిపోతారు. ఉద్ధవా! అందుకే జ్ఞానమిశ్రమ భక్తులు..

**ఆ.వె॥ మనసునందు 'అణువు' మాత్రంపు ద్వైత భా**

**వనలు యుండికూడ 'జ్ఞానగరిమ'**

**వలన, వారు ద్వైత వాసన విడనాడి**

**ముదమునుందు రెపుడు 'ముక్తు' లగుచు.**

**ధ్యేయాకార స్థానము** : ఉద్ధవా! ధ్యేయాకారానికి రెండు స్థానములుంటాయి. (జనుల వ్యవహార భాషలో ధ్యేయం అంటే 'ఎయిమ్' అని చెప్పుకోవచ్చు) సాధనచేసే సిద్ధులు ధ్యేయాకారాన్ని తమ హృదయంలో నిలుపుకొని ధ్యానిస్తారు. పరమాత్మ సర్వభూతముల హృదయాలలో స్థితుడై ఉంటాడు కనుక ఏకాగ్రతతో ఆయనను స్మరిస్తూ ధ్యానిస్తే ఆయన సన్నిధిలో ధ్యానించినట్లే అవుతుంది.



ఉద్ధవా! శరీరంలో 'సుషమ్న' మనే ఒక నాడి ఉన్నది. దాని ఎడమ భాగాన్ని అంటుకొని నాభిప్రదేశానికి పన్నెండు అంగుళాలపై భాగంలో 'హృదయం' తామరమొగ్గ ఆకారంలో ఉంటుంది. తామరమొగ్గలా ఉండుటవలన దానిని 'హృదయ కమలం' అన్నారు. దానికి అధోముఖంగా అంటే నాళం మీదికి ముఖంక్రిందకి ఉంటుంది.

దానికి ఎనిమిది దళములు, కర్ణిక (దుద్దు) ఉన్నాయి. ధ్యానసమయంలో కమలం ఊర్ధ్వముఖంగా అధోనాళంగా దాని కర్ణిక మీద సూర్యుడు, అతనిలోచంద్రుడు, అతనిలో అగ్ని, ఆ అగ్నిలో ధ్యేయమూర్తి (పరమాత్మ) ఉన్నట్లు భావించి ధ్యానించాలి.

ధ్యానం, ప్రాణాయామాలవల్ల మనో నిశ్చలత్వం సిద్ధిస్తుంది. ధ్యానం వలన ఏకాగ్రత లభిస్తుంది. ప్రాణాయామం వలన ప్రాణ శక్తి పెరిగి ప్రాణవాయువు పుష్కలంగా లభిస్తుంది.

**ధ్యానపూర్వాంగం** : ఉద్ధవా! ధ్యానము రెండు విధములు. స్థూలధ్యానము భగవంతుని సాకారంగా ఏదో ఒక రూపంగా

ధ్యానించుట. సూక్ష్మధ్యానం అంటే దయాది గుణములనే సర్వోన్నతంగా భావించి ధ్యానించుట.

ఇక ఎలా ధ్యానించాలో క్లుప్తంగా చెబుతాను.

ధ్యానించేటప్పుడు శరీరం భూమికి తగిలితే దాని తేజస్సు భూగతమై పోతుంది. అందువలన ధ్యానించేవారు సమోన్నతమైన పీఠంపై దర్భలను పరచి వానిపై కృష్ణాజినము దానిపై శుభ్రమైన వస్త్రమును పరచి అట్లు భూ సమాకర్షణను నిరోధించి సుఖాసీనులు కావలెను.

అట్లు కూర్చుండి శరీరం, శిరస్సు, కంఠనాళము వంకరలేనట్లు నిటారుగా ఉంచవలెను. తొడలపై కరతలములుంచుకొని, దృష్టిని నాసికాగ్రమున నిలిపి స్థిమితంగా ధ్యానించుట మొదలు పెట్టాలి.దీనివలన ఏకాగ్రత లభిస్తుంది.

దృష్టి నిలిచిన తరువాత పూరక, కుంభక, రేచక పూర్వకంగా అనులోమ విలోమ క్రమములో నాడీ శోధనను మెల్లమెల్లగా ఒక క్రమ పద్ధతిలో చేయాలి. దీనినే



ప్రాణాయామము అంటారు.

మనుష్యాదులు లోపలికి వెలుపలికి పీల్చి వదిలే వాయువునే ప్రాణమని కొందరు భావిస్తారు. కాని అది సరికాదు. శరీరంలో ఒకవిధమైన అంతశ్శక్తి ఉన్నది. అది శరీరావయువాలను వాటి వాటి వ్యాపృతులతో ప్రవర్తింపజేస్తుంటుంది. ఆ 'శక్తి' కే ప్రాణము అని పేరు. అదిప్రవాహంవలె దేహమంతా ప్రసరిస్తుంది. (అందువల్లే ఏ కదలికా లేని గోళ్లు కూడా పెరుగుతాయి) ఆ ప్రాణమునకు వాయువు తోడ్పడుటచే జీవి ఊపిరి పీల్చి వదలుట జరుగుతున్నది. దానిని ప్రాణవాయువు అన్నారు. ప్రాణరూపమైన ఆ శక్తిని హెచ్చుతగ్గులుక సమున్నతముగా ప్రవర్తింప చేయుటయే ప్రాణయామఫలం.

ప్రాణాయామం గావించునప్పుడు ఆ ప్రాణాన్ని నఖ శిఖ పర్యంతం సక్రమగతిలో వర్తింపజేస్తున్నానని సంకల్పిస్తూ సాధకుడు ప్రాణగతితోటే తన మనసునను అనుసరింపజేయాలి.

అభ్యాసం చేస్తున్న కొద్దీఅంతులోని రహస్యాలు



ఒక్కటొక్కటిగా వాటంతటవే (అప్పుడే పుట్టిన బిడ్డ చనుబాలు త్రాగినట్లు) అర్ధమవుతాయి.

**ప్రత్యాహారం** : ఉద్ధవా! ప్రాణాయామం చేసేటప్పుడు మనసు చలించకుండా నిగ్రహించడాన్నే యోగ పరిభాషలో ప్రత్యాహారం అంటారు.

ముక్కుతో వాయువును విడిచి పెట్టడాన్ని రేచకం అంటారు. ఆ స్థితిలో 'ఓం' అని మొదలు పెట్టి ఆ ప్రణవంతో పాటు వాయువును మూలాధారం నుంచి హృదయ స్థానానికి తీసుకురావాలి. ఓంకార స్వరం సన్నని ఘంటానాదంలాగ ఉంటుంది. ఆ నాదం మూలాధారం నుంచి సుషుమ్న నాళంగుండా సన్నని పట్టుపోగులాగ పైకి పాకి వస్తుంది. ఈ నాదాన్ని 'అనాహతం' అని అంటారు.

యోగాన్ని అభ్యసించేకొద్దీ ఈ నాదం స్పష్టంగా వినవస్తుంటుంది. ప్రతిదినమూ ప్రణవయుక్తంగా ప్రాణాయామము మూడు సార్లు ఆచరించాలి. ఒక్కొక్క సంధ్యలో పది ప్రాణాయామములు చేస్తే చాలును. (దీనిని గురుమూలకంగా అభ్యసించి) అలా ఒక్కమాసం చేస్తే సిద్ధి



కలుగుతుంది.

**ధ్యానావస్థలు** : ఉద్ధవా! ధ్యానావస్థలు రెండు రకములు. అవి సగుణధ్యానావస్థ, నిర్గుణధానావస్థ. సగుణ ధ్యానావస్థలో సాధకుడు తనదృష్టిని బాహ్యపదార్ధములనుంచి మళ్లించి నా సర్వాంగ సుందరమైన స్వరూపంపై నిలిపి ఉంచాలి. అందుకు అతనికి తన మనోబుద్ధులే ఎంతో ఉపయోగపడతాయి.

ఈ రెండవ దశలో దృష్టిని అక్కడి నుంచి మరలించి చిరునవ్వులొలికే నా వదనారవిందంపైనే లగ్నం చేయాలి.

మూడవ దశలో నీ దృష్టిని నా విశ్వరూపం మీద లగ్నం చేయాలి. ఇట్లా మూడు దశలలో సగుణ ధ్యాన పద్ధతిలో నీ మనస్సును నాపై లగ్నం చేసి ధ్యానించాలి.

ఇక నీ మనస్సును నా నిర్గుణ బ్రహ్మతత్త్వమందు లయింపజేయాలి. ఇదే తురీయావస్థ. దీనినే సమాధి అని కూడా అంటారు. ఈ అవస్థలో సాధకుడు తనజీవాత్మను పరమాత్మనైన నాయందు, నేను జీవాత్మయందు జ్యోతి మరొక జ్యోతిలో కలిసినట్లు లీనమవుతాం. దీనినే అద్వైత స్థితి

అంటారు. ఈ స్థితికి వచ్చినప్పుడు ద్రవ్య, జ్ఞాన, క్రియా, భ్రమలన్నీ నశించిపోతాయి. దీనినే నిర్యాణం అని కూడా అంటారు.

సత్సాంగత్యం : ఉద్ధవా! స్వార్థం పరమార్థమై పోతున్న ఈ కాలంలో సజ్జనులు అతి అరుదుగా లభించే దశ వస్తున్నది. భక్తి మరియు అట్టి సజ్జన సాంగత్యము పుష్పము పరిమళము వంటివి. నీవు నాకు ఆప్తుడవు గావున ఒక రహస్యం చెబుతాను.

"నాయనా! యోగము, సౌఖ్యము, ధర్మము, తపము, స్వాధ్యాయనము, త్యాగము, ఇష్టాపూర్తము, దానము, యజ్ఞము, వ్రతము, తీర్థయాత్రలు, మంత్రము, యమనియమములు – ఇత్యాది పద్ధతులన్నీ పరమాత్మ ప్రాప్తికే చేస్తారు. అవి ఒంటరిగా చేసినా, సమిష్టిగా చేసినా ఫలితం చాలా నెమ్మదిగా చాలా శ్రమపడితేకాని సిద్ధించదు. సర్వసంగ పరిత్యాగమే నన్ను చేరు మేలైన దారి అయినప్పటికి నిన్ను తేలికగా ఆ దారిలో ప్రవేశ పెట్టగలిగింది, సజ్జన సాంగత్యం మాత్రమే. ఎందుకంటే..



**కం॥ సజ్జన సాంగత్యంబది**

**ముజ్జగముల మేలు 'దారి' మోహముద్రుంచున్**

**'ఒజ్జ'గ ధర్మము దెలిపెడి**

**సజ్జనుడే సాటిలేని సద్గురువు కదా!!**

అగ్నిలోహాన్ని కిలుమునుండి పరిశుద్ధం చేసినట్లు సాధు సాంగత్యం తత్త్వాన్ని శుద్ధిపరచి రాజస, తామస తత్త్వాలను నెమ్మది నెమ్మదిగా నిర్మూలించి నన్నుపొందే దారిలో ప్రవేశపెడతాయి.

వృత్రాసురునికి అంగీరసుడు, బలిచక్రవర్తికి తన తాత ప్రహ్లాదుడు, బాణాసురునికి శంకరుడు, మయాసురునికి పాండవులు, విభీషణునికి సుగ్రీవుడు, హనుమంతునికి శ్రీరామచంద్రుడు, గజేంద్రునికి విష్ణువు, జటాయువునకు దశరథుడు, తులాధారుడను శూద్రునికి నారదమహాముని వంటి సజ్జన సాంగత్య ఉదాహరణలు కోకొల్లలు.

అంతెందుకు విద్యావాసనలేని గొల్లభామలు నా



మైత్రిచేత ముక్తులయ్యారు. నీవెరిగిన సత్యమే మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను వినుము. మనుష్యులే కాదు ఆ బృందావనములోని చెట్లు, మృగములు, పక్షులు నా సాంగత్యంలో ముక్తిని పొందనున్నాయి.

నన్ను చేరటానికి సాంఖ్యయోగము, తపోమార్గము, ధ్యాననిష్ఠ, స్వాధ్యాయము, సన్యాసము వంటి ఎన్నోదారులున్నా అవన్నీ బహుకాలం పట్టే మార్గాలే. మధ్యలో దారితప్పే ప్రమాదం కూడా ఉన్నది. అయితే సజ్జన సాంగత్యము, భక్తి అతి సులువైన మార్గములు.

**భక్తి రహస్యం** : ఉద్ధవా! ఈ విషయంలో నీ సందేహాలన్నీ పటాపంచలయ్యేట్లు ఒక గొప్పరహస్యం చెబుతాను వినుము. ఒక ప్రదేశానికి పోవుటకు మార్గాలెన్నున్నా రాజమార్గంలో పోయేవాడు శ్రమలేక క్షేమంగా గమ్యం చేరుతాడు. నన్ను చేరుటకు దారులెన్నున్నా నిస్వార్థమైన అనన్యభక్తిని మించిన బాటలేదు.

సంసారంలో ఉండికూడ సర్వం పరిత్యజించి అనన్యభావంతో వయోభేదమే లేక నన్నేకోరి సర్వనిస్సంగులైన



వారు తల్లులుగా, అక్కాచెల్లెళ్లుగా, స్నేహితులుగా ఏవిధంగా నన్ను కోరినా ఆ విధంగానే నన్ను పొందారు.

ధర్మాధర్మములను, ప్రవృత్తి నివృత్తులను, జ్ఞానాజ్ఞానములను, విసర్జించి సర్వాత్మ సమర్పణ పూర్వకంగా అన్నీ నేనేనని భక్తితో నన్నే శరణాగతి పొంది భయ విముక్తుడవై సుఖంగా ఉండుము. నీ బాధ్యత నాదే.

**జీవుని ప్రవేశము** : అనంతరం ఉద్ధవుడు అందరి మనస్సుల్లోనూ నిరంతరం ఉత్పన్నమయ్యే సందేహాని మెల్లగా బయటపెట్టాడు. **"స్వామీ! పరమాత్మ సర్వవ్యాప్తుడు కదా! మరి మా అందరి శరీరాల్లోకి ఏరీతి ప్రవేశించి జీవాత్మ అని పిలువబడుతున్నాడు**? అని అడిగాడు.

చిరునవ్వుతో పరమాత్మ ఇలా చెప్పాడు. **ఇది ఒక్క మాటలో చెప్పే విషయం కాదు. ఎంత వివరించినా ఇంకా సందేహాలు పుడుతూనే ఉంటాయి. అయినా నీకు అర్థమయ్యే విదానంలో చెప్పటానికి ప్రయత్నిస్తాను.**

**ఉద్ధవా! పరమాత్మ తన ప్రకృతి నధిష్టించి విశ్వరూపం**

**ధరించి ప్రపంచాన్ని వెలిగిస్తున్నాడు (మంట బెట్టటంకాదు) ఆయన ప్రకృతి రెండు విధములుగా ఉంటుంది. పరాప్రకృతి** శ్రేష్ఠమైనది. అపరాప్రకృతి జడమైనది.

పరాప్రకృతి నశించుటలేని అక్షరమైనది. అపారప్రకృతి నశింపుగల క్షరరూపము. వీరే అక్షరుడు, క్షరుడు అని పిలువబడుతున్నారు. ఈ రెండు ప్రకృతులను అధిష్ఠించి పురుషోత్తముడని పిలువబడే వాడే పరమాత్మ. జగద్ధారకుడైన ఆయననే ఈశ్వరుడు అంటారు.

ఈశ్వరుడు సృష్టిని కల్పించి ప్రాణరూపాన అందులోనికి ప్రవేశించాడు. ఆ ప్రాణాన్నే జీవుడు అంటారు. అట్లు ప్రవేశించిన జీవుడు సూక్ష్మాతి సూక్ష్మమైన నాదరూపంలో ఉంటాడు.

వెన్నెముకనంటిపెట్టుకొని 'సుషమ్న' మనే నాళం ఒకటున్నది. దాని పొడవునా అక్కడక్కడా ఆరు కమలములున్నాయి. (షట్చక్రములు). ఇక్కడ కమలమంటే తామరపువ్వు అనికాదు, నిలయము అని అర్థం చేసుకోవాలి.



ప్రథమ కమలం మూలాధారంలో ఉంటుంది. గుద స్థానానికి పై భాగాన్నే మూలాధారం అంటారు. పరమాత్మ మొట్టమొదట ఆ మూలాధార కమలంలోనికి ప్రాణరూపంలో ప్రవేశిస్తాడు. ఈ ప్రాణం సూక్ష్మాతి సూక్ష్మమైన నాదరూపంలో ఉంటుంది. మూలాధారం నుంచి సుషమ్న నాళం ద్వారా క్రమక్రమంగా పైపైకి ఎగబ్రాకి ఈనాదం, నాభి ప్రదేశంలో ఉన్న "మణి పూరక కమలం" చేరుకొంటుంది.

అప్పుడు ప్రాణవాయువు కొంత బలపడి "పశ్యంతి" అని పిలువబడుతున్నది. అది మరికొంత బలపడి అక్కడ నుంచి ఆనాళం గుండానే హృదయస్థానంలోని "అనాహత కమలమును" చేరుకుంటుంది.

అప్పుడా "పశ్యంతినే" "మద్యమము" అంటారు. ఆ మధ్యమమే మరికొంత బలపడి" వైఖరి" అనబడింది. ఈ వైఖరీ నాదం మొట్టమొదట మాత్రారూపంగా నుండి స్వరరూపాన్ని పొంది ఆఖరికి వర్ణరూపాన్ని పొందుతుంది.

మాత్రారూపనాదం హ్రస్వదీర్ఘాలయిన క, ఖ మొదలైన



అక్షరాలుగాను శ్రుతమవుతుంది. (వినవస్తుంది) ఈ వర్ణముల ఉచ్ఛారణే 'వాక్కు' అయింది. ప్రాణానికి వాక్కే ప్రధాన లక్షణం అయింది.

ఉద్ధవా! ఈ విధముగా నేను పరా రూపమున శరీరంలో ప్రవేశించి వాక్ రూపములో వ్యక్తమవుతున్నాను. ఈ నేను చెప్పిన 'పశ్యంతినాదం. ప్రాణ సంబంధమైనది. 'మధ్యమనాదం' మనస్సు సంబంధమైనది. "వైఖరీనాదం" బుద్ధికి సంబంధించినది అని తెలుసుకో.

దారువులో స్వతస్సిద్ధంగా అణిగి మణిగి ఉండే అగ్నిని ప్రాణనాదంతోను, దారువును మధించగా వచ్చిన అగ్నిని పశ్యంతీనాదంతోను, కంటికి కనిపించే అగ్నిని వైఖరీ నాదంతోను పోల్చవచ్చును.

**జీవుని లక్షణములు** : ఉద్ధవుడిలా అడిగాడు "స్వామీ! జీవుని ప్రవేశం గురించి కొంత అర్థమయింది మరి జీవి శరీరగతుడై యున్నట్లు ఎలా తెలుస్తుంది?"

పరమాత్మ ఇలా అన్నాడు. **"ఉద్ధవా! నేను** జీవుల శరీరంలో ఉండటం వల్లనే కర్మేంద్రియాలు వాక్కు, కర్మలు,



గతి నిర్ధారణ, విసర్జన వంటి వ్యాపారములను నెరవేరుస్తున్నాయి. స్పర్శ, వినుట, రసన (రుచి), చూచుట, వాసన తెలుసుకొనుట అను ఐదురకములైన జ్ఞానమును ఆ జ్ఞానేంద్రియములిస్తున్నాయి. మనస్సు సంకల్పరూపమైన తన వ్యాపారమును చేస్తున్నది. బుద్ధి, చిత్తములు, విజ్ఞానరూపమైన వ్యాపారములను చేయుచున్నవి. అహంకారము స్వాభిమాన రూపమైన వ్యాపారమును నెరవేర్చుచున్నది. ఇక సూత్రాత్మ సత్త్వ, రజస్సు, తమస్సు అను త్రిగుణములయొక్క వ్యాపారమును చేస్తున్నది.

ఈపై చెప్పిన ఏ ఒక్క లక్షణం కనిపించినా నేను ఆ ఉపాధిలో ఉన్నానని నిశ్చయమైనట్లే.

**సూత్రాత్మ** : ఉద్ధవుడు "స్వామీ! సూత్రాత్మ గురించి వివరించండి" అన్నాడు.

దానికి పరమాత్మ ఇలా అన్నాడు. "ఉద్ధవా! సూత్రాత్మ నా ప్రకృతి వలన కలుగుతున్నది. సూత్రాత్మకు హిరణ్యగర్భుడు, మహత్తు, వాయువు అని కూడా పేర్లు ఉన్నాయి. పౌరాణిక భాషలో ఈ సూత్రాత్మను 'బ్రహ్మ' అని పిలుస్తారు. సృష్టికర్త

అని పిలుస్తున్నది కూడా ఈయననే. సూత్రాత్మనుంచి మనస్సు జనిస్తున్నది.

ఉద్ధవా! అసలు జీవుడంటే జీవింపచేసే వాడని అర్థం. మొట్టమొదట పరమాత్మే జీవుడు. ఆయనే 'ఏకుదు', అవ్యక్తుడు అని తెలుసుకో. ఆయనే తన విశిష్టమైన శక్తిచేత ప్రకృతిని అధిష్టించి కాలక్రమాన వివిధ రూపములు ధరించి వేర్వేరు ప్రాణులుగా రూపుదిద్దుకొన్నది. ఆ సమిష్టి జీవరాశియే 'విశ్వము' అని పిలువబడుతున్నది.

**సంసారవృక్షము** : ఉద్ధవా! ఈ విశ్వాన్ని ఒక మహావృక్షంతో పోల్చవచ్చును. ఈ వృక్షానికి ధర్మము, అధర్మము అనే రెండు బీజములున్నాయి. ఈ సంసారవృక్షం నిరంతరం కర్మాతీతమై ఉంటుంది. ఆ వృక్షానికి కోరికలే వేళ్లు. దానికి గుణత్రయములే కాండము. పంచ భూతములనే కొమ్మలు విస్తరించి దానికుంటాయి. ఇక కర్మేంద్రియములు దానికి ఉపశాఖలు. పంచేంద్రియములు నాళములు. ఆ చెట్టుకి సుఖదుఃఖాలనే ఫలాలు కాస్తుంటాయి. దానిపై పరమాత్మ జీవాత్మ అనే రెండు పక్షులు కాపురం ఉంటాయి.



ఈ సంసార వృక్షం సూర్యమండలం వరకు వ్యాపించి ఉంటుంది. దానికి ఆపైన వ్యాప్తిలేదు. జీవుడు సకామకర్మలాచరిస్తున్నంతకాలం ఆ కర్మయొక్క ఫలాలను భోగిస్తూ అక్కడే పర్యటిస్తుంటాయి.

ఆ సత్కర్మల వల్ల ఒకవేళ మహాపుణ్యం సంపాదించగలిగితే ఈ భూమండలాన్ని వదలి సూర్యమండలం చేరుకొని ఇక పునర్జన్మ అనే పునరావృత్తి లేక అక్కడే ఉండిపోతాడు.

మళ్లీ ఇంకొకసారి సంసారవృక్షంపైన ఆ రెండు పక్షులగురించి ఆలోచిద్దాం. ఆ రెండు పక్షుల జీవాత్మ మరియు పరమాత్మ అని చెప్పాను కదా! ఇక ఆ రెండు పక్షులకు గల భేదమేమిటో చూడు. జీవుడు గుణబద్ధుడు. అందుచేత అతనికి కాంక్ష ఉంటుంది. కాంక్షవలన ఇంద్రియములకు లొంగిపోయి కర్మలనాచరిస్తూ తత్ఫలంగా పాపపుణ్యాలు తత్ఫలంగా దుఃఖము సుఖమూ అనుభవిస్తుంటాడు. జనన మరణ రూపమయిన సంసార నిమగ్నుడై ఉంటాడు.



ఇక పరమాత్మ రెండ పక్షిరూపంలో అదే సంసార వృక్షంపై ఉన్నప్పటికీ, ఆయన నిష్కాముడు, జితేంద్రియుడు కాబట్టి ఫలాసక్తిలేక సదా సుఖంగా ఉంటాడు.

**కాంక్షాబీజం** : ఉద్ధవుడు "స్వామీ! మానవునికి సంభవించే ఆపదలకు కారణమేమిటి?" అని ప్రశ్నించాడు. పరమాత్మ ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు.

**చం॥ మనుజుల బాధలన్నిటికి వారల కాంక్షయె**
**మూలకారణం**
**బనివిను, లొంగి కాంక్షలకు అందరునా**
**విషయావశిష్టులై**
**అనయము వీధి కుక్కలయి ఆశతొ పర్వులు**
**తీయుచుందురున్**
**పెనచిన జ్ఞాన శూన్యతయె వెర్రికి కారణ**
**మయ్య ఉద్ధవా!**



**ఉద్ధవా ! ఇక్కడ జ్ఞాన శూన్యత్వమంటే జ్ఞానంలేకపోవటం అనికాదు. హితము అహితములను అర్థం చేసుకోలేనంతగా పెనవేసుకొన్న అజ్ఞానమనే వెర్రిభ్రమ.**

**ఇది ఒకరకమైన విపరీత జ్ఞానం. దీని మూలకారణం 'మమకారం'. మమకారానికి మూలకారణం మనస్సు. మనస్సు అంటే ప్రారబ్ధ కర్మవాసనా సముచ్చయము. వాసనలు శుద్ధాశుద్ధ మిశ్రమములై త్రిగుణముల యొక్క వ్యాపార ఫలితములై యుంటాయి. మనస్సు వ్యవహరించే తీరును బట్టి బుద్ధిచిత్తము అహంకారం అని పిలువబడుతున్నది.**

**బుద్ధికి హితమేదో అహితమేదో నిశ్చయించే శక్తి సహజంగానే ఉంటుంది. బుద్ధికి మలినవాసనలు పెనవేసుకొన్నప్పుడు బుద్ధిచేసే సద్బోధ మనస్సు వినదు. దానివల్ల మర్త్యుడు చెడిపోతున్నాడు.**

**బుద్ధిబోధ ఘంటాపథంగా వినబడాలంటే దానికి శాస్త్రజ్ఞానం సజ్జన సాంగత్యం జతపడాలి. శాస్త్రజ్ఞానం రజోగుణంయొక్క ఉధృతిని తగ్గిస్తుంది. సత్సాంగత్యం**

**సత్త్వగుణాన్ని వృద్ధి చేస్తుంది. దానివల్ల బుద్ధిశక్తి బలపడుతుంది. అప్పుడు అది చేసే సద్బోధ తలకెక్కుతుంది.**

అప్పుడు ఉద్ధవుడిలా అడిగాడు. "స్వామి! మనస్సు త్రిగుణాత్మకమన్నావు కదా! అందరూ గుణావసిష్టులేనా లేక ఎవరైనా గుణాతీతులుంటారా?"

పరమాత్మ ఇలా సమాధానమిచ్చాడు. "ఉద్ధవా! లోకమంతా గుణ బద్ధమైయున్నది. వివేకిని కూడ ఈ గుణాలు లొంగదీసుకొంటాయనే మాట సత్యమే. అయితే వివేక శక్తి, శాస్త్రజ్ఞానం, సజ్జన సాంగత్యం వల్ల వృద్ధిపొంది, రజస్తమో గుణవికారాలకు లొంగకుండా గుణాతీత స్థితిని చేకూరుస్తుంది.

ఒకవేళ అజాగ్రత్త వల్లనో ప్రమాదవశాత్తునో గుణాలకు లొంగిపోయినా వెనువెంటనే కోలుకొని గుణాతీతమవుతుంది.

ఉద్ధవా! రజస్తమస్సుల ఉద్ధతి తగ్గించుటకు సులభోపాయం త్రిసంధ్యలలో ప్రాణాయామం చేస్తూ క్రమేపీ



ఏకాగ్రతను సాధించడమే. ఆ విధంగా మనస్సును సులభంగా నాపై లగ్నం చేసినచో రజస్తమో గుణాలు శూన్యమై సత్త్వగుణం అలవడుతుంది.

ఉద్ధవా! ఈ యోగవిద్యను మొట్టమొదట నేను సనకసనందనాదులకు నేర్పాను. దానివల్ల వారెన్నో శుభాలను పొందారు. వారికి ఆవిద్యనేనెలా బోధించానో. ఇప్పుడు నీకు వివరిస్తాను వినుము.

**హంస చేసిన ఉపదేశం** :

ఉద్ధవా! సనక సనందనులు మొదలైన మునులు బ్రహ్మదేవుని మానసపుత్రులు. సృష్టి నిర్వర్తిస్తారనే ఉద్దేశ్యంతో బ్రహ్మవారిని సృష్టించినా వారు భగవంతుని ధ్యానసలో బ్రతుకు వెళ్లబుచ్చుతామని తమకు అనుమతి నీయమని సదా నాధ్యాసలో మునిగి యధేచ్ఛానుసారం లోక సంచారం చేస్తుంటారు.

వారు బ్రహ్మవద్దకు వచ్చి "తండ్రీ! ఇంద్రియములు ఇంద్రియార్థముల వంకకు ఆకర్షింపబడుతున్నాయి. తిరిగి



ఇంద్రియార్థములు ఇంద్రియాలవైపు ఆకర్షింపబడుతున్నాయి. ఈ పరస్పరాకర్షణ అనుక్షణం జరుగుతూనే ఉన్నది. దీనివల్ల మర్త్యులకు ఊరట లభించుటలేదు. ఈ ద్వంద్వ యుద్ధం మానివేసే తరుణోపాయమేమిటి? వాటినుంచి ముక్తి కలిగే దారియే లేదా?" అని అడిగారు.

ఈ ప్రశ్నలకు చతుర్ముఖునికి కూడవెంటనే ప్రత్యుత్తరం స్ఫురించక అసలీ ప్రశ్నలకు బీజం ఎక్కడో కనుగొనుటకు ప్రయత్నించి విఫలుడయ్యాడు. అతని మనస్సు కూడా ప్రవృత్తి పరమై తత్త్వరహస్యం స్ఫురించలేదు. మనస్సు ప్రవృత్తి పరాఙ్ముఖమైనప్పుడు తత్త్వరహస్యం తెలియవలెనంటే ఏకాంత స్థితిని మనస్సు పొందాలి.

అది అంత తేలికకాదు. బ్రహ్మపరమాత్మ భావనతో నన్ను స్మరించాడు. నేను విరించి ముందు సనకాదుల సమక్షంలో "హంస" వలె ప్రత్యక్షమయ్యాను. వారు నన్ను చూచి "నీవెవరివి?" అని అడిగారు. అప్పుడు నేనువారితో ఇలా అన్నాను.

"ఓమునులారా! "నీవు" అన్నమాటకు అర్థమేమిటో



ఆలోచించండి. మీరు అనుకున్న ఆ "నీవు" ఎవరు? "దేహమా?" లేక ఈ దేహంలో ఉన్ననా "ఆత్మా?" ఆత్మగురించి అంటే మీ ప్రశ్నయే తప్పు. ఎందుకంటే ఆత్మ ఏకము మరియు అద్వితీయము. నీ ఆత్మ, వాడి ఆత్మ, నా ఆత్మ అని వేర్వేరుగా ఉండవు. పోనీ మీ ప్రశ్న నాదేహం గురించి అనుకొందామంటే అదీ తప్పే. ఎందుకంటే దేహం పాంచభౌతికం. అంటే మట్టి (పృథ్వి), గాలి (వాయువు), నీరు (జలము), వేడిమి (తేజస్సు), శూన్యప్రదేశము (ఆకాశము) అను పంచభూతములతో నిర్మింపబడినది. ఏ దేహంలో ఉన్నా పంచ భూతాలలో మార్పుండదు. కాబట్టి మీ ప్రశ్న దేహానికి ఆత్మకి రెంటికీ వర్తించదు. అందుకని ప్రశాంతంగా సావధానచిత్తులై నేను చెప్పే తత్త్వాన్ని అర్థం చేసుకోండి.

మునులారా! ఈ సృష్టి అంతా బ్రహ్మము మరియు ప్రకృతి అను రెండింటి సమ్మేళనమే. ఈ ప్రకృతినే వ్యావహారికంగా 'మనస్సు' అంటున్నాం. అది కన్నులు మొదలైన ఇంద్రియముల ద్వారా ప్రవర్తిస్తుంటుంది. ఆ ఇంద్రియాలు ఏమిచేసినా బ్రహ్మమునైన నన్ను

అనుభవిస్తున్నాయి. వాటికి నాకంటే "ఇతఃపరమ"న్నదే లేదు. సర్వమూ బ్రహ్మమే అయినచో ఇక రెండవది ఎట్లా ఉంటుంది? ఈ చిన్న రహస్యం తెలియక వేరొకటి ఉన్నదని మనస్సు భ్రాంతి చెందినంతమాత్రాన నా పరతత్వానికి వచ్చిన ఇబ్బంది లేనేలేదు.

మునులారా! మనస్సుకు ఇంద్రియాలకు అవినాభావ సంబంధం ఉండటం వలన మనస్సే జీవుడను కొను వారికి, దేహమే జీవుడనుకొనే భ్రమ కలుగుతుంది. జీవాత్మకి పరమాత్మకీ అభేదమైనందువలన దేహమే పరమాత్మ అనుకొని విర్రవీగే ప్రమాదం ఉన్నది. ఈ 'దేహాత్మ బుద్ధి' సర్వానర్ధదాయకం.

ఈ భావం ఎందుకు కలుగుతున్నదంటే "అధ్యాసము" వలన కలుగుతున్నది. అధ్యాసమంటే ఒకదాని యందు మరొకదాని తత్త్వాన్ని ఆరోపించుటయే అధ్యాసమంటారు. ఈ అధ్యాసానికి కారణం వేరెవరూకాదు, మనస్సే కారణం. మనస్సు నిరంతరం మూడు గుణములకు లోబడి ఉండటం చేత అది గుణముల కార్యములైన ఇంద్రియార్ధములలో



తగులుకొని ఉంటుంది. అట్లా తగులుకొని ఉన్నందువలన గుణములు చేసే పనులన్నీ తను చేసేపనులుగా మనస్సు భ్రమిస్తుంది. అప్పుడు మనోభాగమైన 'అహంకారం. తలయెత్తి భోక్తృత్వం అనుభవించి అన్నింటికి నేనే అధికారిని నావలననే ఇదంతా అయింది అని అనుకొంటుంది.

ఈ అహంకారం జ్యోతిని క్రమ్ముకొన్న ధూమం (పొగ) వలె జీవుని ఆవరించి ఉంటుంది. అందువలన జీవాత్మ ప్రకాశం మందగిస్తుంది. దీపంయొక్క ప్రకాశం ఎక్కడ పడకపోతే అక్కడ చీకటి ఉన్నట్లు ఆత్మప్రకాశాన్ని అహంకారం ఆవరించి మనస్సును అజ్ఞానం అనే అంధకారంలోపడి ఆత్మముఖంకాక ఇంద్రియ ముఖమై వర్తిస్తుంటుంది.

అప్పుడు ఉపాధులలో ఉన్న అహంకారం ప్రకోపించి ఎన్నో విచిత్రాలు చేస్తుంది. ఒకచోట వున్న రాజు మంత్రి సేవకుడు ఈ ముగ్గురిని ఆత్మ, అహంకారం, మనస్సులతో పోల్చవచ్చును. రాజాజ్ఞను మంత్రి స్వీకరించి సైనికునికి ఒప్ప చెబుతాడు. వాడు తన దృష్టిని రాజుపై నిలిపి ఎప్పుడేం



ముంచుకొస్తుందో అనే భయంతో రాజాజ్ఞలు పాటిస్తుంటాడు. ఒకవేళ రాజు కంటే మంత్రే అధికారం చెలాయించే వాడయితే, సేవకుడు రాజుతో పనిలేక మంత్రికి లోబడి నడుచుకొంటుంటాడు.

అదేవిధంగా అహంకారం తక్కువ పాళ్లల్లో ఉన్నప్పుడు ఆత్మ దీప్తి మనస్సును ఆక్రమించి ఉంటుంది. అదే అహంకారం దట్టించి ఉన్నప్పుడు మనస్సు ఆత్మ దృష్టిలేక అహంకరించి ఉంటుంది. ఆత్మబోధనిక మనస్సులెక్కచేయదు.

**కం॥ మనసది 'జడ'మైన యెడన్**

**సనకాదుల్లార! 'అహము' జడమౌను కదా!**

**తను ఎట్లు స్వతంత్ర్యంబును**

**గొని, ఆరోపణలజేయు కొల్లలు? వినుడీ!**

ఒక చక్కని ఉదాహరణతో నేను మీకు జడము అయిన మనస్సులాగే అహంకారంకూడ జడమైనా స్వతంత్రించి ఎట్లు వర్తిస్తాయో ఎట్లు ఆరోపణలు కోకొల్లలుగా చేస్తాయో వివరిస్తాను వినండి.



మునులారా! ఒక అయస్కాంతం ముక్క ఉన్నది. దాని సమీపంలో ఒక ఇనుపముక్క ఉంటే అది వెంటనే ఆ ఇనుపముక్కని ఆకర్షించి దానికి అతుక్కునేట్లు చేస్తుంది. అది కదిలించినట్టల్లా ఇనుపముక్క ఆడుతుంది.

ఆ రెండిటి నడుమ ఏదన్నా వస్త్రము అడ్డం ఉంటే వస్త్రము ఎన్ని ముడతలు వున్నది అనే దానిపై ఆ ఆకర్షణశక్తి తద్వారా ఆ ఇనుపముక్క కదలిక కూడ ఆధారపడి ఉంటుంది.

అలాగే అయస్కాంతం ఆత్మ అయితే ఇనుపముక్క మనస్సు. మనస్సు ఎంత బలంగా ఆత్మరూపియైన పరమాత్మను అంటిపెట్టుకొని ఉంటుందనేది మధ్యలో ఉన్న అహంకారం అనే వస్త్రపు తెరమీద ఆధారపడి ఉంటుంది. అహంకారం ఎక్కువైతే ఆత్మభాసించి మనస్సునాకర్షించదు.

కనుక మనఃకార్యాలు కూడ మనస్సుకు ఆత్మకు నడుమ అడ్డంగా ఉన్న అహంకారం యొక్క బలాబలాలను బట్టి ఉంటాయి.

ఓ మునులారా! ఈ సృష్టి సమస్తము విభ్రమ మాత్రమై

క్షణక్షణానికి మార్పు చెందేదిగా నిలకడ లేక ఉన్నది. కొరివిని చక్రాకారంలో వేగంగా త్రిప్పుతుంటే చూసేవారికి అవిచ్ఛిన్నమైన చక్రాకారపు మంటవలె కనబడుతుంది. అలాగే సృష్టిదాని విభ్రమ వేగం వలన మాత్రమే అవిచ్ఛిన్నంగా కనబడుతున్నది. ఈ రహస్యం తెలియక అజ్ఞానంతో సృష్టిశాస్వతం అనుకొనేవారినే మనగలం?

మునులారా! జగత్తు మిధ్య కాబట్టి అంతా మిధ్యా వ్యవహారమని శంకించవద్దు. మిధ్య అంటే శూన్యమని కాని, అభావమని కాని భావించకండి.

అద్వైతి యొక్క భాషా భావప్రపంచంలో శూన్యము భావము రెండూ లేవు. అయితే ద్వైతి మాత్రం ప్రపంచం వేరని బ్రహ్మము దానికి భిన్నమైనదని వ్యవహరిస్తాడు. అద్వైతి బ్రహ్మమే ప్రపంచమని వ్యవహరిస్తాడు.

కాబట్టి రూపనామాలు సత్యమని ద్వైతి భావిస్తే అవి 'తాత్కాలికం' గా మాత్రమే సత్యమని అద్వైతి తలచుచున్నాడు. అద్వైతి తాత్కాలిక సత్యమేదీ పారమార్థిక సత్యం కానేరదని వాదిస్తాడు. అనుష్ఠానం చేయదగ్గ రూపనామములు మాత్రమే



శాశ్వతం అని అద్వైతి భావన. అందుకే అద్వైతం భేద భావనని నిషేధిస్తున్నది. కాని లోకవ్యవహారాన్ని నిషేధించుటలేదు. ఇద్దరికీ (ద్వైతికి, అద్వైతికి) ఆకలి దప్పులు, నిద్ర, మెలకువలు దయాదాక్షిణ్యములు సమానంగానే ఉంటాయి. ఇద్దరికీ ముఖ్యమైన తేడా ఏమంటే ద్వైతి స్వసంగ్రహార్థం వ్యవహరిస్తే అద్వైతి లోకకళ్యాణం కోసం వ్యవహరిస్తున్నట్లుంటుంది.

మునులారా! అధ్రువము, మాయామయము అయిన సృష్టివైపునుంచి తమయొక్క దృష్టిని మరలించి మర్త్యులు 'ఆత్మపరం' చేస్తే, ఆశల ఊబిలో చిక్కుకొనకుండా అనంత సుఖానుభవమును సాధించుటకు ప్రయత్నించాలి.

ఆవిధంగా ఎంత ఆత్మపరం చేసినా ఆశలు అంతర్లీనమైన పూర్వవాసనల వల్ల అప్పుడప్పుడు బాహ్యాముఖానికి లాగుతుంటాయి. అయినప్పటికీ 'స్థితప్రజ్ఞుడు' అప్పటికప్పుడే ప్రక్షాలన చేసుకొంటుంటాడు.

కొంతమంది స్థితప్రజ్ఞులకు' ప్రపంచ స్ఫురణ తమజీవితకాలంలోనే పూర్తిగా అంతరించిపోతుంది. మరికొందరికి తమ జీవితాంతం 'స్మృతి' మాత్రంగా



ఉంటుంది. మొదటిరకం వారిని 'జీవన్ముక్తుల'ని రెండవరకం వారిని 'విదేహముక్తులని' అంటారు. ఇక్కడి ప్రపంచ స్ఫురణనే 'దేహాభిమానం' అని కూడా అనవచ్చును. అది స్మృతి రూపంలో ఉంటుంది.

జీవన్ముక్తులకు స్మృతిరూపంలో కూడా దేహాభిమానం ఉండదు. సురాపానమత్తులకు వలె దేహస్మృతియే వీరికి పట్టదు. కొందరికి దేహం అంతరించాక ఆ స్మృతి అంతరిస్తుంది. అట్టివారు సంపూర్ణ ముక్తులవుతారు.

మునులారా మనస్సువల్ల కర్మలనాచరిస్తారు. కర్మల వల్ల ఫలితం భోక్తం కాకతప్పదు. ఇది మరుజన్మలో ప్రారబ్ధమై దాని ననుభవించటానికి ఆత్మకు దేహాన్ని సమకూరుస్తోంది. ఒక్కసారి దేహం రాగానే దేహంపై 'నాది' అనే వ్యామోహం కలుగుతోంది. దేహమే ఆత్మ అనే భ్రాంతి కలుగుతున్నది. దేహ పతనమయ్యేదాక సుఖదుఃఖముల ననుభవిస్తూ రాగద్వేషాలతో జీవిస్తారు. వారిని మర్త్యులు అంటున్నాం.

దేహము వంకకే మనస్సును మళ్లించని వారికి దేహానికి కలిగే స్థితిగతులేవీ పట్టవు.



ఓ మునిశ్రేష్ఠులారా! సాంఖ్యరహస్యాన్ని తెలియాలంటే ఆత్మ అనాత్మలను రెండిటిని (సంఖ్య రెండుకదా!) క్షుణ్ణంగా అర్ధం చేసుకొని తద్వారా ఆత్మరూపియై సాధనవల్ల ముక్తి సాధించుటయే సాంఖ్యయోగం ఎన్నుకున్న మార్గం.

అట్లే కర్మయోగులు నిష్కామకర్ములై నిస్సంగులై జ్ఞానులై విజ్ఞాన యోగ రహస్యములనెరిగి సాధనద్వారా ముక్తిని కష్టమైనా పట్టుదలతో సాధిస్తారు. కాబట్టి మునులారా! 'ముక్తి' అంటే ఏదేదో అనుకోకండి. అది ఒకవిధమైన అంతఃకరణ స్థితి మాత్రమే. ఈ పరమార్ధం మీకు వివరించటానికే శ్రీమన్నారాయణుడనైన నేను హంసరూపం ధరించి మీముందుకు వచ్చాను"

ఉద్ధవా! నేను సనకాది మహామునులకు ఆ విధంగా 'హంసోపదేశం' అని ప్రసిద్ధి చెందిన తత్త్వబోధనందించాను.

పిమ్మట ఉద్ధవుడు "దేవా! ఈ హంసోపదేశంలో అధ్యాసము వలన సత్యమసత్యముగా, అసత్యము సత్యముగా అనిపిస్తుందని ఒక్క బ్రహ్మమే సత్యమని చెప్పావు కదా! అసలీ అధ్యాసమంటే ఏమిటి? అదెలా కలుగుతున్నది? ఎరింగింప గోరెదను" అన్నాడు.

భగవానుడు చిరునవ్వుతో "ఉద్ధవా! ఈ వివరాలు అర్థం కావాలంటే గురుశిష్యసంవాద రూపంలో వింటే విపులంగా అర్థమవుతుంది. అది వినుము అని ఇలా చెప్పసాగాడు.

అధ్యాసం : గురువు తన శిష్యునికి అధ్యాసం గురించి ఇలా చెబుతున్నాడు.

గురువుశిష్యా! ఒకదానికున్న ధర్మాలను (లక్షణాలను) ఇంకొకదానియందున్నట్లు ఆరోపించుటను 'అధ్యాసం' అంటారు.

చీకటిలో త్రాటిని చూచి సర్పమని భ్రమపడి భయంతో తల్లడిల్లిపోవుట జరుగుతుంది. తార్కికంగా ఆలోచిస్తే సర్వధర్మములను త్రాటియందు ఆరోపించి త్రాటినే సర్పము అనుకొంటున్నాం. ఈ భావమే అధ్యాసమని అంటారు. అది ఇలా విభజించబడింది.



## అధ్యాసము

శిష్యా తార్కికంగా ఇవన్నీ అర్థంచేసికొనుట చాలా కష్టము. స్థాలీపులాక న్యాయంగా సాధ్యమైనంత తేలికగా వివరిస్తాను వినుము.

ఇదివరలో చెప్పిన రజ్జు (త్రాడు) సర్ప భ్రాంతినే మరొక్కసారి ఆలోచించు.

అధ్యాసము కలగాలంటే మిధ్యావస్తువు, భ్రాంతి జ్ఞానము అనే రెండు ఉండాలి. లేకపోతే అధ్యాస కలుగదు. సర్పమును గురించి జ్ఞానమే లేనివాడు త్రాటిని సర్పం ఎలా అనుకొంటాడు? కాబట్టి భ్రాంతికి కారణం మిధ్యాజ్ఞానం. ఈ భ్రాంతి జ్ఞానాన్నే జ్ఞానాధ్యాసము అంటున్నారు. మిధ్యావస్తువు (త్రాడు)ను 'అర్థా ధ్యాసము' అంటున్నారు. ఇది కూడా రెండు రకములు. స్వరూపాధ్యాసము మరియు సంసర్గా ధ్యాసము.

రజ్జువునందు భౌతికంగా లేని సర్పమును దాని స్వరూపమును అధ్యాసము నొందుట వలన దానిని



స్వరూపాధ్యాసము అన్నారు. సర్పము రజ్జువు అను ఈ రెంటికీ అభేదము ఏర్పడినందున అనిర్వచనీయమైన మూడవ పదార్థం ద్యోతకమయింది.

అద్దమునకు వదనమునకు ఏ సంబంధమూ లేక పోయినా అద్దములో ప్రతిఫలించే ప్రతిబింబం ఆ రెంటికీ సంబంధం కలిగిస్తున్నది. ఈ ప్రతిబింబమన్నా నిజంగా ఉన్నదంటావా? లేదు. అదీ మిధ్యయే. సంసర్గము అంటే సంబంధం అని భావించవచ్చును. అట్టి సంసర్గం కారణాన అనిర్వచనీయమైన ప్రతిబింబం కలిగినది. అందువల్ల దానిని సంసర్గ అధ్యాసము అన్నారు.

ఈ స్వరూపాధ్యాసము కూడా నాలుగు విధములుగా విభజించబడింది. మొదటిది "కేవల ధర్మాధ్యాసము" ఇందులో ఒక వస్తువుయొక్క ధర్మాన్నిమాత్రమే మరొక వస్తువునందు ఆరోపిస్తారు. ఇంద్రియాలయొక్క ధర్మాలను ఆత్మయొక్క ధర్మాలుగా పొరబడినందువల్ల వాటి ధర్మాలు ఆత్మ ధర్మాలనుకొంటున్నారు. కాని స్వరూపాలు ఒకటని అనుకోవటం లేదు. ధర్మాన్ని మాత్రమే ఆరోపిస్తున్నందువల్ల



ఈ అధ్యాసము 'కేవల ధర్మాధ్యాసము' అని పిలువబడుతున్నది.

అట్లుగాక ధర్మాన్నీ, ఆ ధర్మానికి ఆశ్రయమైన వస్తువును (రెండింటినీ) ఆరోపించుటనే "ధర్మసహిత ధర్మాధ్యాసము" అని అంటున్నారు. ఎట్లాగంటే.. అంతఃకరణానికి కర్తృత్వం వంటి ధర్మాలు ఉన్నాయి కదా! ఆ ధర్మాలను తీసికొని వాటితో అంతఃకరణను గ్రహించి, ఆత్మయందు ఆ ధర్మాలను ఆరోపించి ఆత్మయే 'కర్త' అని పొరబడటమే ధర్మసహిత ధర్మాధ్యాసమవుతుంది.

అయఃపిండము, అగ్ని – ఈ రెండూ వేర్వేరే. కానీ అయఃపిండాన్ని అగ్నిలో కాల్చినప్పుడు 'అగ్నిపిండంగా కనిపిస్తున్నది. అంతేకాని దానికొక ప్రత్యేకమైన అవస్థలేదు. ఇక్కడ అగ్నిమరియు అయఃపిండమూ ఒకదానికొకటి అధ్యవస్థములు కనుక దీనినే అన్యోన్య అధ్యావస్థ అని అన్నారు.

రెండు పదార్థములలో ఒకటి అధ్యాసానికి (అధ్యస్తానికి) సాధ్యం ఏమాత్రం కాకపోవటమూ రెండవది సాధ్యమైనదిగా ఉండటమూ జరుగుచున్నవి. అధ్యాసానికి సాధ్యంకాని

దానియందు, అధ్యాసానికి సాధ్యంకానిదానిని ఆరోపించుటను ''అన్యతరాధ్యాసము'' అని అంటారు. ఇది స్వరూపాధ్యాసములోని మూడవ రకము (అధ్యాస విభజన చూడండి) ఇక్కడ ఒక ఉదాహరణ వినుము.

ఆత్మ–అహంకారము అనే రెండింటిలో ఆత్మకు రూపమే లేదు కదా! రూపమే లేని దానిని ఎలా ఆరోపిస్తారు? కాబట్టి దానిని అహంకారమునందు ఆరోపించే అవకాశమే లేదు. కాని అహంకారాన్ని మాత్రం ఆరోపించటానికే వీలున్నది. అందువల్ల అహంకారాన్ని ఆత్మయందు ఆరోపించి, అహంకారమే ఆత్మ అని పొరబడుతున్నారు. దీనినె "అనతరాధ్యాసము" అని అంటున్నారు.

ఆత్మయందు 'అనాత్మ' వస్తువుయొక్క సంబంధ స్వరూపములను రెంటినీ ఆరోపించటాన్ని "సంబంధ సహిత సంబంధాధ్యాసము'' అని అంటారు. ధర్మసహిత ధర్మాధ్యాసలో ధర్మాన్ని ఆరోపిస్తారు. ఇక్కడ సంబంధియొక్క సంబంధాన్ని ఆరోపిస్తారు. ఇదీ ఆ రెంటికీ భేదం.



కేవలం సంబంధాన్ని మాత్రమే ఆరోపించటాన్ని "కేవల సంబంధాధ్యాసము" అని అంటారు.

సంబంధ సహిత సంబంధ్యాధ్యాసం, సంసర్గ అధ్యాస సహిత స్వరూప అధ్యాసానికీ, అన్యోన్య అధ్యాసం సంసర్గ స్వరూపాధ్యాసానికీ అంతర్భూతాలుగా ఉన్నాయి.

అధ్యాస సామగ్రి : శిష్యుడు అప్పుడు తనగురువుని "స్వామీ! అద్యాస గురించి వివరించావు, మరి ఈ అద్యాసన కలుగుటకు కారణములేమియో వివరించండి'' అని అడిగాడు.

గురువు ఇలా వివరిస్తున్నాడు. ఉద్ధవా! అధ్యాస కలుగుటకు ఆరు కారణములున్నవి. (1) సత్యవస్తు జ్ఞాన జన్య సంస్కారము : ఇందాకటి ఉదాహరణలో రజ్జువుని చూసి సర్పమని భ్రాంతిజెంది భీతిల్లుటకు ప్రస్తావించాను కదా! అసలు భీతికి కారణమేమిటి? సర్పజ్ఞానమే కదా! సర్పము ఆకారంలో త్రాటిని పోలి ఉంటుంది. కాని అది కాటువేస్తే మరణిస్తాం. మరణ భయమే సర్పభయం. ముందు ఆవ్యక్తి ఇదివరకు సర్పాన్ని చూసి ఉండాలి, లేదా త్రాటివలె



ఉంటుందని విని ఉండాలి. ఈ రెండూ జరుగకపోతే సర్పభ్రాంతి కలుగనే కలుగదు. సత్యసర్పజ్ఞానం ఉండటం చేత ఆ జ్ఞాన జన్య సంస్కారం త్రాటిని చూసినప్పుడు స్మృతి రూపాన ప్రతీతమై "అధ్యాస" కలిగిస్తున్నది. ఇక్కడ సర్ప అధ్యసింపబడలేదు. కాని సర్ప జ్ఞాన జన్య సంస్కారం మాత్రమే అధ్యసింపబడినది.

(2) ప్రమాతృదోషం : శిష్యా! ప్రమాత అనగా "చూసేవాడు" అని అర్థం. ఆ చూసేవాడిలో భయాదులు కలుగుటచేత ప్రమాతృదోషం కలిగి భ్రాంతిగా పరిణమించింది.

(3) ప్రమాణదోషం : చూచుట, వినుట మొదలగు వాటికి సాధనాలైన కన్నులు చెవులు మొదలైన జ్ఞానేంద్రియములలో పిత్త కామనాదులు కలుగుటచే ప్రమాణదోషం.

(4) ప్రమేయ దోషం. శిష్యా! ప్రమాణ జ్ఞానానికి విషయమైనది ప్రమేయం. ఎలాగంటే.. సర్పభ్రాంతికి అధిష్ఠానమైనది త్రాడు. త్రాడే లేకపోతే సర్పభ్రాంతికి ఆస్కారమే లేదు. అంటే అధిష్ఠానమైన త్రాటికి, అధ్యస్తమైన సర్పానికి సాదృశ్యం ఉండితీరాలి. సాదృశ్యమే లేకపోతే అధ్యాసకు ఆస్కారమే లేదు



కదా! అట్టిసాదృశ్యాన్నే ప్రమేయ దోషం అంటున్నారు.

(5) అధిష్ఠానం సామాన్య రూపజ్ఞానం : శిష్యా ఇది విను. భ్రాంతి కలిగే సమయంలో ఏది స్ఫురిస్తే భ్రాంతి కలుగుతుందో, ఏది స్ఫురించక పోతే భ్రాంతి కలుగదో దానినే అధిష్ఠాన సామాన్య రూపజ్ఞానం అంటారు.

(6) అధిష్ఠాన విశేష రూపజ్ఞానం : శిష్యా భ్రాంతి కాలము నందు ఏది కలుగదో ఏది కలిగినందువల్ల భ్రాంతి తొలగిపోతున్నదో అదే అధిష్ఠాన విశేష రూపజ్ఞానము అని పిలువబడుతున్నది.

సామాన్య రూపజ్ఞానము విశేష రూపజ్ఞానము రెండూ లేకపోతే అధిష్ఠానమేలేదు. విశేషం ఇంకొకటుందిక్కడ. సర్పభ్రాంతి కలుగుటకు ఇంతకు పూర్వం నిజమైన సర్పాన్ని పోలిన దానిని చూపించి సర్పం ఇలా వుంటుందని ఎవరిద్వారానైనా తెలియపరచటం వలన సర్పజ్ఞాన సంస్కారం కలిగి ఉండవచ్చును. ఈ సంస్కారం అవ్యవహితంగా ఉండాలి. వ్యవహితమై విస్మృతిప్రాయమైతే అధ్యాసం కలుగుటకు ఆస్కారం లేదు.

శిష్యుడు ఇలా అడుగుతున్నాడు. "స్వామీ! అందుకు కారణమేమిటో వివరించండి''. గురువు ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు. శిష్యా! దానికి కారణం అవిద్య. మాత్రమే. అయితే అవిద్య ఎక్కడినుంచి వచ్చింది? అనాది నుంచి వచ్చింది. దాని పుట్టుక ఎప్పుడు జరిగిందో చెప్పలేం. ఒక్కొక్కప్పుడు దాని ఉనికి చోటే గోచరించదు. కనుక ఇక్కడినుంచి వచ్చిందని చెప్పలేం.

శిష్యుడిలా అడుగుతున్నాడు. "స్వామీ! అవిద్య చేసే హాని ఏమిటి?"

గురువు ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు "శిష్యా! ఏకముగానున్న బ్రహ్మమును 'నానాత్వం' ఆరోపించి ఆవిధంగా భావింప చేయుటయే అవిధ్య చేయు హాని (కార్యము). జీవుడు ఏకుడు అద్వితీయుడు అయినా తనయందు అధ్యస్తమైన ఉపాధితో ఏకీభావము పొందినందున ఉపాధి కార్యములైన కర్తృత్వ భోక్తృత్వములు తనవిగానే భావిస్తున్నాడు. అందువలన జీవునికి సంసారిత్వం సుఖదుఃఖ భోక్తృత్వం కలుగుతున్నవి. జీవుడు బద్ధుడు అనే భావనలో ఉద్దేశ్యం ఇదే.



అప్పుడు శిష్యుడిలా అడిగాడు. "స్వామీ! అవిద్యకు మాయకు భేదమిటి?

గురువు ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు. నాయనా! అవిద్యనే మాయ అన్నారు. మాయ ఇదమిత్థమని నిరూపించటం సాధ్యంకాదు. అలాగని మాయ బొత్తిగా లేదని అనలేము. ఎందుకంటే మాయా కార్యమైన భ్రాంతి కలుగుతూనే ఉన్నది. మాయ సత్యమైతే త్రికాలములలోనూ ఉండాలి. సత్యజ్ఞానం కలుగగానే మాయ కనిపించకుండా పోతున్నది.

తత్త్వబోధవింటున్న శిష్యుడు ఇంతవరకు అధ్యాసము, దానిలోని రకరకములైన విధములను సోదాహరణంగా విన్నాడు. తరువాత అధ్యాస సామాగ్రిని గురించి వింటూ అధ్యాసకలుగుటకు కారణములను నేర్చాడు. జ్ఞానమును భ్రష్టుపట్టించే అవిద్య గురించి విన్నాడు. అవిద్యయే మాయ అని గ్రహించాడు. మాయకు సార్వకాలిక స్థితిలేదని మాయఉన్నదో లేదో చెప్పలేక దానిని అనిర్వచనీయమంటారని గ్రహించాడు. ఆ స్థితినే 'మిధ్య' అంటారని అంటే భావ అభావ నిరూపణ సాధ్యంకాని స్థితి అనేగాని శూన్యం కాదని విన్నాడు.



ఏమీ తెలియనివానికి ఏసందేహమూ రాదు. అన్నీ తెలిసినవానికి సందేహాలు రానే రావు. జ్ఞానోపార్జన చేస్తున్నవానికి అనంతమైన సందేహాలు...

శిష్యుడు ఆపై గురువునిలా అడుగుతున్నాడు "స్వామీ! త్రికాలాబాధితమైనదేదికాదో అది మాత్రమే సత్యమని చెప్పారు కదా! అట్టిది బ్రహ్మము కాక తప్పదన్నారు. మాయకూడ కాలబాధితమై నశించేది కావున అది 'మిధ్య' అన్నారు. మిధ్యాత్మకమైన ఆ మాయ బ్రహ్మమునందు ఆరోపింపబడి బ్రహ్మమునకే నానాత్వ భావాన్ని అంటగడుతోంది అన్నారు. మిధ్యా సత్యాలకు చీకటి వెలుగులవలె సయోధ్య కుదరనే కుదరదన్నారు కదా! మరి వాటిమధ్య సంబంధం ఎలా ఏర్పడింది? అట్లా సంబంధం కలిగినప్పుడు సత్యత్వానికి భంగం వాటిల్లదా?

గురువు ఇలా ప్రత్యుత్తర మిచ్చాడు..

"నాయనా! ఏకము అయిన బ్రహ్మమునందు నానాత్వం ఆరోపింపబడి దానిని వేర్వేరుగా భావించుటయే అవిద్య. నీవన్న సంబంధం వ్యావహారికమే గాని పారమార్థికం



కాదు. రజ్జువును సర్పమని భ్రమించినప్పుడు రజ్జుధర్మానికి ఏనష్టమూ కలుగలేదు. అట్లే బ్రహ్మము నందు మాయాత్వం ఆరోపించబడినప్పుడు బ్రహ్మత్వానికి ఏనష్టమూ రాలేదు.

అప్పడు శిష్యుడు "మరి ఈ అధ్యాసము నశించే మార్గమేమిటి స్వామీ!" అని ప్రశ్నించాడు.

గురువు ఇలా చెప్పసాగాడు. "నాయనా! సర్పమని త్రాటిననుకొన్నవానికి దీపం తీసుకొనివచ్చి అది త్రాడు మాత్రమేనని చూపిస్తే సర్పభ్రాంతి నశించి సత్యజ్ఞానం కలిగి, మిధ్యాభ్రాంతి అయిన అధ్యాసం నశిస్తుంది"

శిష్యుడిలా అడిగాడు ''స్వామీ! సత్యజ్ఞానం తీర్థయాత్రల వలన కలుగుతుందా?"

గురువిలాబదులిచ్చాడు "నాయనా! తీర్థయాత్రల వలన "చిత్తశుద్ధి" కలుగుతుందికాని జ్ఞానోదయం కాదు. జ్ఞానము స్వతస్సిద్ధం. జ్ఞానం ఇది వరకు లేకుండా అప్పటికప్పుడు పుట్టేదికాదు. జ్ఞానోత్పత్తి అంటే జ్ఞానాన్ని ఆవరించియున్న అహంకార మమకారములు,రాగద్వేషములు, తొలగించబడి జ్ఞానం జ్యోతివలె ఆత్మలో ప్రకాశించడం. దాన్నే

వేదాంతపరిభాషలో ముక్తి లేక మోక్షము అంటున్నారు.

(లోక సామాన్య రీతిలో చెప్పుకుంటే, ఆత్మ శరీరధారియైన వేళ జీవన్ముక్తుడు, శరీర త్యాగియైనప్పుడు పునర్జన్మ రహితుడు అన్నమాట)

శిష్యుడు తిరిగి ఇలా ప్రశ్నిస్తున్నాడు "స్వామీ! బ్రహ్మము జగత్తు-వీటిలో ఏది ఇంకొక దానిలో ఆరోపింపబడుతున్నది?"

గురువిలా ప్రత్యుత్తరమిచ్చాడు. "నాయనా! బ్రహ్మము జగత్తునందు ఆరోపింపబడినప్పుడు 'మిథ్య' అవుతున్నది. కాని బ్రహ్మ సత్యముకదా? అందుచేత బ్రహ్మత్వాన్ని జగత్తునందు ఆరోపిద్దామంటే అదీ వీల్లేదు. ఎందుకంటే బ్రహ్మము ఇంద్రియాతీతము. ఇక ఇంద్రియాతీతం ఇంద్రియగోచరమెలా అవుతుంది? కావున ఆరెండూ ఒక దానికింకొకటి ఆరోపితంకావు.

తరువాత శిష్యుడు వేసే వరుస ప్రశ్నలకు గురువు చెబుతున్న సమాధానాలు ఈక్రింది విధంగా ఉన్నాయి.



**ప్రశ్న:** స్వామీ! బ్రహ్మము మరియు జగత్తు ఈరెండూ వేర్వేరు పదార్థములన్నది సత్యమయితేనే కదా! అధ్యాసానికి అవకాశం ఉండేది?

**సమాధానం** : నాయనా! అధ్యాసకాలంలో ఆరెండూ వేర్వేరుగానే భావింపబడుతున్నాయి.

**ప్రశ్న:** బ్రహ్మము జగత్తూ ఈరెండూ సత్యము లేనా?

**సమాధానం** : బ్రహ్మమునకు పారమార్థిక సత్యత్వం, జగత్తునకు తాత్కాలిక సత్యత్వం చెప్పబడ్డాయి. మొత్తానికి రెండూ సత్యాలే. అధ్యాసకాలంలో రెండు సత్యాలుగానే గోచరిస్తాయి.

**ప్రశ్న** : స్వామీ! జగత్తు మిధ్య అన్నారు. మిధ్యకు ప్రత్యేక అవస్థ లేదుకదా! మరి జగత్తు మిధ్య అయితే అధ్యాసానికి రెండవ వస్తువువేముంటుంది?

**సమాధానం** : శిష్యా! జగన్మిధ్య అనేది పరిశీలనకు తర్వాత ఏర్పడుతున్నది. అధ్యాసకాలంలో అట్టి భావమేలేదు. అందువల్ల జగత్తునకు అధ్యాసకాలంలో ప్రధమావస్థ,



ద్వితీయత్వం రెండూ కలుగుతున్నాయి.

**ప్రశ్న** : ఆరోపణకు ఇది దీనియందు ఆరోపింపబడుతున్నదని తెలుసుకోవటానికి ఒక వ్యక్తి ఉండాలి కదా! అది ఎవరు?

**సమాధానం** : నాయనా! వేరువేరు పదార్థాలను ఒక్కొక్కప్పుడు అజ్ఞానం వల్ల ఒకటిగానే భావిస్తుంటాము. ఒక ఉదాహరణ చెబుతాను వినుము.'నాదేహం' అన్నప్పుడు ఆ 'నేను' అనే ఆత్మ అది ధరించిన 'దేహం' రెండు వేర్వేరని జ్ఞానికి స్పష్టమే. అజ్ఞానిమాత్రం తానే దేహము దేహమే తాను అని విశ్వసిస్తుంటాడు. ఆత్మ ఒక వస్తువు కాదు. కాని దేహాదులు ఆత్మయందు ఆరోపింపబడినప్పుడు ఆ ఆత్మ తాను కర్తనని అవయవాలు కల భోక్తనని భావిస్తున్నది. అధ్యాసకాలంలో ఆత్మయొక్క

**ప్రశ్న** : జ్ఞాన స్వరూపుడయిన బ్రహ్మమే జీవుడయితే ఇంకా తెలుసుకోవాల్సినదేముంటుంది? ఆ తెలుసుకొనే**శక్తి** తన యందు తానే అధ్యాసం చేసి పొరబడే అవకాశం ఉన్నదా?

**సమాధానం** : నాయనా! నిజానికి ఆత్మ ఎన్నటికీ జ్ఞేయపదార్థం కానేరదు. ఆత్మజ్ఞానమంటే ఉపాధితో కూడిన ఆత్మ



యొక్కజ్ఞానమని తాత్పర్యం. ఎందుకంటే ఉపాధి లేక జ్ఞానసముపార్జన సాధ్యమే కాదు. ఆత్మ వస్తువు కానందువల్ల దానిని ఇంకో దానితో ఆరోపించబడుతున్నదని అన్నాము కదా! ఇదేదో చెట్టు ముందా విత్తు ముందా అనే వ్యవహారంలా ఉన్నది కదా! అయితే ఒక్క విషయం మాత్రం స్పష్టమవుతున్నది. ఉపాధి కారణం వలన మాత్రమే ఆత్మకు కర్తృత్వం, కర్మకు వస్తుత్వం రెండు ఒక్కసారే కలుగుతున్నాయి.

**ప్రశ్న** : స్వామీ! పూర్వదృష్టిమైన వస్తువుయొక్క సామ్యం జ్ఞప్తికివచ్చి అధ్యాస కలిగి, త్రాటిని సర్పమని పొరబడిన సంగతి తెలిసిందే. మరి బ్రహ్మము జగత్తు విషయంలో ఏది పూర్వజం? ఏది అనంతరీయం?

**సమాధానం** : నాయనా! అజ్ఞానం వల్లనే అధ్యాసం కలుగుతున్నది. కాబట్టి ఆరోపించదలచిన వస్తువు యొక్క జ్ఞానం సత్యజ్ఞానం కావలసిన అవసరం లేదు. ఆ పదార్థానికి సంబంధించిన జ్ఞానం ఏదో ఒక విధంగా సమకూడితే చాలు. అది మిధ్యాజ్ఞానం కూడా కావచ్చు. ఆత్మ ఉన్నదని ఏదో ఒక విధంగా సంపాదించిన జ్ఞానం వల్ల మాత్రమే తెలుస్తున్నది.

ఆత్మ ఉన్నదనే జ్ఞానం ఏదో విధంగా లేకపోతే ఇక లోకంలో తెలుసుకోతగ్గదేముంటుంది? ఏది తెలుసుకున్నా మనం ఆత్మ వల్లనే తెలుసుకుంటున్నాం. (ఆధునికులు Power of Brain అనుకోండి) ఆత్మలేక పోతే అనుభవజ్ఞానమే లేదు. నాయనా! ఇంకొక విషయం మనం ఆరోపించదలచిన వస్తువు మన కట్టెదుట నుండనవసరం కూడా లేదు. అయినా భ్రాంతి కలుగవచ్చు. మన కంటికి ఆకాశం నీలంగా కనిపిస్తున్నది కాని నీలంరంగు పదార్థమేదీ ఆకాశంలో లేదు.మరి భ్రాంతి కలుగుటలేదా?

శిష్యా! ప్రపంచంలోని నానాత్వం ప్రత్యక్షంగా కన్నులకు కనిపిస్తున్న జ్ఞానం. దాన్ని కాదనడం మూర్ఖత్వం, అని నీలాంటి వాళ్ళు భావించవచ్చును. కాని నీ 'ప్రత్యక్షజ్ఞానం' కన్నులకు కనిపించేదే కదా! అదెంత? మురికి నీటిలోని సూక్ష్మ జీవులను చూడగలవా?ఆకాశంలోని 'నాదాన్ని' వినగలవా? కాలిన నాలుకతో రుచిని గ్రహించగలవా? జలుబు చేస్తే వాసన తెలుస్తుందా? వృద్ధాప్యంలో గతస్మృతులన్నీ పదిలంగా ఉంటాయా? కనుక ఇంద్రియాల



సామర్థ్యంతో నిర్ణయించబడిన ప్రమాణం ప్రమాణమే కాదు.

కాబట్టి **ఆరోపించ** జ్ఞానవే 'మిధ్యాజ్ఞానం' అటువంటప్పుడు వాస్తవం ఎలా అవుతుంది?

ఇక ఈతాత్కాలిక జ్ఞానం, సత్యజ్ఞానం కానేకాదు. ఒక్కమాట మాత్రం నిజం. అధ్యాసమాన వస్తు జ్ఞానం 'స్మృతి' మాత్రంగా ఉంటెచాలు. అధ్యాస కలుగుతుంది. వస్తువు యొక్క జ్ఞాపకం మాత్రమే అనగా సంస్కారం మాత్రమే వ్యవహరిస్తున్నది.

**ప్రశ్న** : ఇప్పుడిక స్వామీ! వస్తుజ్ఞానం తాత్కాలికమైనా, సార్వకాలికమైనా మరేదైనా "అప్పటికి అది సత్యమే" అని మీమాంసకులు వాదిస్తున్నారు. దీనికేమంటారు?

**సమాధానం** : అనుభవమాత్ర జ్ఞానం సత్యజ్ఞానం కానవసరం లేదని ఆకాశం నీలంరంగులో భ్రమ కలిగించటం గురించి చెప్పినప్పుడు వివరించాను. కాబట్టి మీ మాంసకుల వాదం యుక్తికి నిలవదు.

**ప్రశ్న** : స్వామీ! అసత్యమనే దానికి ఉనికే లేదని సత్యంతో పోల్చి సత్యంకానిదాన్నే అసత్యం అంటున్నారు. అనుభవ



జ్ఞానం కలిగించనిదే అసత్యం. జగత్తు అనుభవం కలిగిస్తుంటే మిధ్య ఎలా అవుతుంది? తత్సంబంధమైన జ్ఞానం ఎలా కలుగుతున్నది అని 'ప్రభాకరమతం' వాదిస్తున్నది. దీనిసంగతేమిటి?

**సమాధానం** : శిష్యా! ఎండమావి నిదర్శనంతో నేను ప్రభాకరమతమును ఖండిస్తాను, వినుము. ఎండమావిని మరీచిక అంటారు. విశాలమైన మైదానాలలో నడుస్తున్నప్పుడు సూర్యుడు వాయుమండలాన్ని బాగా వేడెక్కించినప్పుడు వస్తువులపై నుంచి వచ్చిన కాంతికిరణాలు "లోపరివర్తనం" చెంది చూసేవారికి నేలపై నుండి వస్తువు బింబం ప్రతిఫలించినట్లూ, అక్కడ జలం ఉండటం వల్లనే అట్లా జరిగినట్లు అనిపిస్తుంది. దీన్నే మరీచిక లేక ఎండమావి అంటున్నాం. చూసేవారి కన్నులకి అక్కడ నీటి చెలమ ఉన్నట్లే కనిపిస్తుంది.

ఇక నేను చెప్పేది విను. మరీచికలోని జలం సత్యమనటానికి గాని వీలుకుదరదు. సత్యమనటానికి అది త్రాగే నీరు కాదు. అసత్యమందామంటే జలలక్షణం



కనిపిస్తోంది. అట్టి స్ఫురణకు కారణమేమిటి? అది అనిర్వచనీయం. అంటే బుద్ధికి గోచరించే విషయం కాదు.

ఇక్కడ సూర్యుడు సత్యపదార్థం. మరీచిక అసత్య అనుభవం. ఎండ తీవ్రంగా లేనప్పుడు ఆ అనుభవం కలుగకపోవచ్చును. సత్యపదార్థాన్ని అసత్య అనుభవంతో మరీచికయో లేక జలమో తెలుసుకొనవచ్చును. సత్యమైనది సర్వకాలసర్వావస్థలయందు సత్యంగానే ఉంటుంది. సూర్యునికే మార్పు ఉండదు. అసత్యమైనదానికే భ్రాంతిజనిత సత్యస్ఫురణ కలుగవచ్చు. అది అన్ని వేళలా సత్యం కాదు. ఏదో ఒకప్పుడు పొరతొలగి తెలుస్తుంది.

సూర్యునివలె బ్రహ్మము ఎప్పుడూ సత్యమే. వానిలో ఏమార్పులేదు. మాయ, మాయా కార్యఫలం ఇవి రెండూ బ్రహ్మమునందు ఆరోపించబడి సత్యాలుగా అనిపిస్తున్నాయి. కాని సత్యములుకావు. ఒక వేళ ఒకానొక సమయంలో సత్యంగా కనిపించినా ఏదయితే ఎల్లవేళలా సత్యం కాదో అది అసత్యమే అవుతుంది. అందుకని మరీచిక భ్రాంతి అసత్యము. కానీ అనుభవాన్ని కలిగించే భ్రాంతి.

జగత్తు లేదనటానికి వీల్లేదు. ఎందుకంటే అది అనుభవాన్నిస్తోంది. పోనీ ఉంది అందామా అంటే ఇది పుట్టింది కాబట్టి లయమవకతప్పదు. అందుకే జగత్తుని అనిర్వచనీయమంటున్నాం.

**ప్రశ్న :** స్వామీ! ఆత్మ అన్నది లేనే లేదని, త్రాటిని చూచి సర్పమనుకొనే వ్యక్తి విజ్ఞానమే సర్పరూపం దాల్చి సర్పభావన కలుగచేస్తోందని బౌద్ధులు వాదిస్తున్నారు. ఇది సరి అయినదేనా?

**సమాధానం** : నాయనా! విజ్ఞానవే సర్పరూపం దాల్చినట్లయితే త్రాటిని చూచి సర్పభ్రాంతి కలుగుతున్నప్పుడు 'ఇదిపాము' అన్న భావమే కలుగదు. విజ్ఞానం ఎప్పుడు సర్పరూపం దాల్చిందో అప్పుడే నేను పామును అని, నా పాము అనిగాని ఏర్పడుతుంది. దేనిపై ఆరోపిస్తున్నామో దానికి, దేనిని ఆరోపిస్తున్నామో దానికిగల సహజ భేదము గ్రహించలేకపోవటంవల్ల ఇటువంటి ప్రమాదం కలుగుతున్నది. ఈవిధంగా ఆలోచిస్తున్నదియై



ప్రభాకరమతం ఈవిషయంలోనే బౌద్ధాన్ని వ్యతిరేకిస్తోంది.

**ప్రశ్న** : స్వామీ! మరి' "నైయాయిక (న్యాయం) మతం" ఏం చెబుతున్నది?

**సమాధానం** : శిష్యా! నైయాయికులు ప్రభాకరమతాన్ని నిరసిస్తారు. త్రికాల బాధితమైన వాస్తవస్థితి లేకపోయినా తాత్కాలిక మాత్రసత్యత్వం ఉంటుందని అందుకు కారణం అనిర్వచనీయమని నైయాయికులు వాదిస్తారు. నాయనా! ముత్యపుచిప్ప తళతళా మెరుస్తూ కనబడుతున్నదనుకో. దానిని చూచి నీవు వెండి అని భ్రమించావనుకో. అప్పుడు నిజంగా జరిగినదేమిటి? నీకు వెండికి సంబంధించిన జ్ఞానం ఉండటం వల్ల, ముత్యపుచిప్పకు మెరుపు ఉండటం వల్ల తాత్కాలికంగా రెండూ ఒకటేనేమో అనే 'మాయ' ఆవరించటం వల్ల, వెండి అనుభవం మిధ్యకాదని, ఇంద్రియాలు ఇంద్రియార్థాలతో సంయోగమైనప్పుడు పదార్థజ్ఞానం కలుగుతున్నదని అందువలన పదార్థజ్ఞానం కలుగుతున్నదని వారు భావిస్తారు. పొగను చూచి నిప్పుఉంది అని భావించి (పూర్వ జ్ఞానం వల్ల) స్థిరనిశ్చయానికి రావటం వల్ల అనుమానం కూడా



ప్రమాణంగా తీసుకోవచ్చునీ ముత్యపుచిప్పలో వెండి దర్శనం 'అభావం' కాదని తాత్కాలిక జ్ఞానం అనుభవం ద్వారా చివరికి సత్యంగానే పరిణమిస్తుందని నైయాయికుల నమ్మకం. ఇది అంతా తరచి చూచినకొద్దీ తరగని సందేహాలు కలిగించె తర్కం. వాదనలవల్ల ఒక్కొక్కప్పుడు తాత్కాలిక సత్యం నిత్యసత్యమనిపించే ప్రయత్నం జరగవచ్చు. ఇంద్రియ జ్ఞానం మరీ పరిమితం కావున వాదనతో సత్యస్ఫురణ కలుగనూవచ్చు కలుగకపోనూవచ్చు, అనివారు నమ్ముతారు.

**ప్రశ్న** : స్వామీ! ప్రతి మతమూ తన మాటే సత్యమంటోంది. పైగా అవి ఒకదానికొకటి విరుద్ధంగా కూడా ఉంటున్నాయి. నాబుద్ధి కలవరపడుతోందే గాని సత్యం తెలియరావడం లేదు.

**సమాధానం** : నాయనా! సత్యమొక్కటియే ఉంటుంది. దానికి జాతి, మత, లింగ, భక్తి, విశ్వాస భేదం లేదు. మతానికి సంబంధించిన ఏసత్యమైనా దాని స్థాపకునికి భగవత్ప్రేరణ వల్ల కలిగిందే. అయితే అది అతనికి స్ఫురించినంత వరకే సత్యము అదిపూర్ణ సత్యం కానక్కరలేదు.



**ప్రశ్న** : అయితే ఇది సత్యమని నిశ్చయించే మార్గమేమిటి?

**సమాధానము** : శిష్యా! దానికి 'యుక్తి' ఒక్కటే పరమసాధనం. ఏది సర్వ సత్యాలకు ఈలోకంతోనే సుఖాన్ని (శాంతిని) హితవును కలుగచేస్తుందో అదే సత్యం. సర్వపరిత్యాగం వలన తప్ప సత్య స్వరూపం అవగతంకాదు. 'అభిమానత్యాగం' చేస్తే సర్వం పరిత్యజించినట్లే. సర్వపరిత్యాగం 'ధీరులు' మాత్రమే చేయగలరు. అందుకే వారికి మాత్రమే సత్యస్ఫురణ అవుతుంది. అతనే కృతకృత్యుడు. అతని మతమే సత్యమతం. అదే వేదాంతం.

**ప్రశ్న** : స్వామీ! వేదాంతం కేవలం దర్శనప్రాయమే గాని అనుష్ఠాన యోగ్యం కాదని అది మిధ్యామతమని కొందరూ, బాహ్యపదార్థాలన్నీ ద్వైత బుద్ధి ప్రతిపాదితాలే తప్ప సత్యాలు కావని కొందరు , సార్వలౌకికమైన 'అఖండమనస్సే' భగవంతుడని వేరొకరు అంటున్నారు. దేనిని నమ్మను?

**సమాధానం :** నాయనా! బ్రహ్మమొక్కటే సత్యము. సర్వమూ బ్రహ్మమే, బ్రహ్మకు వ్యతిరేకమైనది లేదు.

ప్రశ్న: స్వామీ! మరి జీవుని సంగతి ఏమిటి?

సమాధానంః శిష్యా! బ్రహ్మకు వ్యతిరిక్తమైన ఉపాధి నొక్క దానిని ఊహించారు. దానిలో బ్రహ్మ యొక్క అంశను ప్రవేశపెట్టారు. దానికి జనన మరణాలు కల్పించారు.ఆ జీవుడు తన స్వస్థానమైన బ్రహ్మమును చేరు మార్గములను సూచించారు. ఇవన్నీ పామర జనులకు అజ్ఞానం తొలగించటానికి ప్రయత్నాలు మాత్రమే. సత్పదార్థస్వభావం గురించిన అజ్ఞానం వలన “విపరీత జ్ఞానం” కలుగుతున్నది. దానిని రూపుమాపుటకు ‘శాఖాచంద్ర న్యాయాన్ని’ అవలంభించారు. అంతే....

**ప్రశ్న** : స్వామీ! వేదాంతం సిద్ధాంతానికి మూలసూత్రాలేమీ?

**సమాధానం** అయమాత్మా బ్రహ్మ,సర్వంఖల్విదం బ్రహ్మ, అన్న రెండు వేదాంతంలోని మూలసూత్రాలు. మొదటిది. “ ఆత్మయే బ్రహ్మము” అని చెబుతోంది. ఇక రెండవది; ‘ఇదం’ అనగా దృశ్యము సర్వమూ బ్రహ్మము అంటున్నది.

మొదటి సూత్రములోని “ఆత్మ”ను రెండవ దానిలోని దృశ్యాన్ని



‘లుప్తం’ చేసినప్పుడు ‘బ్రహ్మము’ మాత్రమే మిగులుతుంది. అట్లా మిగులినది తప్పక ఏకము అద్వితీయమూ అని స్పష్టవవుతున్నది కదా! ఆత్మామరియూ దృశ్యమూ బ్రహ్మమైనచో బ్రహ్మ కానిది వేరేదీ లేదని స్పష్టమవుతున్నది కదా! అనగా ఒక్క పదార్థమే బ్రహ్మమని, ఆత్మఅని, ప్రపంచం అని వేర్వేరు సమయాల్లో వేర్వేరుగా పిలువ బడుతున్నదని స్పష్ట మవుతున్నది కదా! ఇదే వేదాంత సిద్ధాంతము.

**ప్రశ్న** : స్వామీ! అధ్యాస మరియు అవిద్యలకు గల సామ్య తారతమ్యాల గురించి మరొకమారు వివరించగలరా?

**సమాధానము** : నాయానా! అధ్యాసకారణం కాగా అవిద్య దానికార్యం అవుతున్నది. అవిద్య అంటే విద్య లేకపోవడం కాదు, విపరీత జ్ఞానం ఉండటం. అంటే జ్ఞానం యొక్క అభావం కాదు. యదార్థజ్ఞానం యయనియమాదులచేత శ్రవణ, మనన, నిధిధ్యాసలచేత కలుగుతున్నది అధ్యాసకారణంగా అధ్యస్తవస్తువు యొక్కగాని, అధిష్టాన వస్తువుయొక్క గాని సదసద్గుణాలు బాధింపబడవు. అవి



యధాస్థితిలోనే ఉంటాయి. సత్యజ్ఞానంతోనశించిన అవిద్యకు (విపరీత జ్ఞానానికి) పునరావృత్తి లేదు.

కాబట్టి మొదట విపరీత జ్ఞానం ఏవిషయంలోనైనా కలిగినా అది సత్యజ్ఞానం వలన నశించి మళ్ళీ అటువంటి విపరీతజ్ఞానం కలుగకుండా చేస్తుంది. ముత్యపు చిప్పలో వెండి ఉన్నదని మొదటి విపరీత జ్ఞానం కలిగినా, నిజం తెలిశాక ఆవిపరీత జ్ఞానం ఇక కలుగదు. అసలు ముత్యపు చిప్పల్లో వెండి ఉండదనే సత్యస్వరూపం గోచరిస్తుంది.

శిష్యా! జాగ్రత్తగా గమనించు, ఆరోపితాలైన అనాత్మ లక్షణాలచే (వెండి యొక్క లక్షణాలు) అధిష్టానమైన ఆత్మ యొక్క లక్షణం (ముత్యపు చిప్ప మెరుపు లక్షణం) బాధితమై ఉంటే ఆత్మయందు అనాత్మయొక్క లక్షణాలు వ్యాపించుటచేత అవిద్య (విపరీత జ్ఞానం)తల ఎత్తుతుంది. అయితే అవిద్య ఒకసారి నశిస్తే మళ్ళీ తలఎత్తదు. అంటే నశించిన అవిద్యకు పునరావృత్తి లేదు.

నాయనా!ఎన్ని చెప్పినా,ఎంత సేపుచెప్పినా,ఏవిధంగా చెప్పినా అన్నీ జ్ఞాన సముపార్జనకే. శాస్త్రజ్ఞానం ఎంత ఉన్నా అది



స్వానుభవంతో పటిష్టం కాకపోతే పునాది లేని భవనమే అవుతుంది. అట్టి శాస్త్రజ్ఞానానికో అవిద్యకు పెద్ద తేడా లేదు.అలాగని శాస్త్రజ్ఞానాన్ని నిరసించరాదు. మంచి చెడ్డలు తెలుసుకోవటానికి అది అవసరం.మంచి గ్రహించి చెడుని నిరసించరాదు. మంచి చెడుని నిరసించటం జ్ఞాన సముపార్జనకు తొలిమెట్టు.

**ప్రశ్న** ః స్వామీ! ఈ మంచీ చెడూల వివేకం కలగటం ఒక్క మర్తులకేనా లేక చతుష్పాద జంతువులకూ జరుగుతుందా అను సందేహం కలుగుతున్నది.అది అసాధ్యమా?

**సమాధానం** : నాయనా! అట్టి వివేకం కలిగినందువల్లనే బెత్తం ఝళిపిస్తే పారిపోయే ఆవులు గడ్డి వేసినపుడు అప్యాయంగా దగ్గరకువస్తాయి. పెంపుడు జంతువులు కొన్ని యజమాని చనిపోతే ఆహారాన్ని కూడా విసర్జించి అవీ మరణిస్తాయి. ఇది జన్మ సంస్కారాన్ని బట్టి వస్తుందనే మాట నిజం.అది స్ఫురించే, మోక్షం సాధించిన జంతువులు కూడా ఉన్నాయి. ఇదినూటికీ జరిగేదే కానీ చతుష్పాదవర్తనులన్నీ పశువులే. మర్త్యులకు పశువులకు నిద్ర, భయము,

ఆకలిదప్పులూ కామవాంఛలలో పెద్ద తేడా లేకపోయినా అధ్యాత్మ వివేచనలో నింగికీనేలకూ ఉన్న వ్యత్యాసమున్నది. పశువులకు దేహధ్యాస తప్ప ఆత్మజ్ఞానం కలుగదు. ఆత్మజ్ఞానం లేనిదే మోక్షం సిద్ధించదు. ఆత్మజ్ఞానం లేనివారు దేహమే సర్వస్వమని దైహిక సుఖాలకే వెంపర్లాడి తిరిగి పశుపక్ష్యాది జన్మలలో పడి చుక్కాని లేని నావవలె సంసార సాగరంలో కొట్టుకొని పోతుంటారు.

**ప్రశ్న** : స్వామీ! యజ్ఞయాగాదులు వల్ల గానీ వేదాంతం వల్లగాని మోక్షం సిద్ధిస్తుందా?

**సమాధానం:** నాయనా! యజ్ఞ యాగాదులుచేసే వారు ఇతర కర్మిష్టులూ, ఆత్మయే 'కర్త' అనే భావంతోనే తామే 'భోక్త' అనే భావంతోనే ఆకర్మలన్నీ నిర్వహిస్తున్నారు. దానివల్ల ఉత్తమ జన్మలభిస్తుంది. దీని వలన కలిగే తృప్తి వారికి ముఖ్యం. వేదాంతి దీనిని నిరసిస్తాడు. వేదాంతి నిష్కామకర్మచే నిస్సంగుడై ఆత్మజ్ఞానం పొంది చివరికి మోక్షం సాధిస్తాడు.



**ప్రశ్న** : వేదాంతి తొలి రోజులలో అజ్ఞానియే కదా! కాబట్టి స్వామీ! అజ్ఞానిని నిరసించరాదు కదా?

**సమాధానం** : నాయానా! ముల్లు గుచ్చుకుంటే ఇంకొక ముల్లుతో ఈ ముల్లును తీసివేసి చివరికి రెంటినీ దూరంగా పారవేస్తున్నాం కదా! అలాగే అజ్ఞానంతో ఆరంభమైనా శాస్త్రజ్ఞానంతో సహజ అజ్ఞానాన్ని పోగొట్టి చివరికి శాస్త్రజ్ఞానం కూడా విసర్జించి ఆత్మజ్ఞానంతో "సోహం" అనే భావనతో తత్త్వార్థం తెలుసుకొనిమోక్షం సాధించు. నేను చెప్పినదంతా పునస్సమీక్షించుకొంటే నీకు తప్పక సాధ్యమవుతుంది.

ఆ తరువాత శ్రీ కృష్ణపరమాత్మ చిరునగవుతో తన భక్తుడైన ఉద్ధవునికిలా అంటున్నాడు.

**కం॥ సందేహము తీరినదా?**
**ఉందా లవలేశమైన ఉద్ధవ? ఐనా**
**ఎందులకు నీకు యోచన?**
**ఆందోళన విడిచి అడుగుమన్నియు నిపుడే.**



అంత హర్షపులకాంకితుడైన ఉద్ధవుడు నందనందనుని ఇలా అడిగాడు."స్వామీ! ముక్తి సంపాదనకు బ్రహ్మవేత్తలు అనేక మార్గములను సూచించిరి. అన్ని మార్గములూ ముఖ్యమైనవేనా? అందులో ఏదో ఒకటి ఆచరిస్తే చాలదా? నీవు భక్తియే లెస్స అంటున్నావు కాబట్టి తక్కిననివి అనపేక్షితాలా? ఏ మార్గం అవలంభిస్తే మనస్సు ఇంద్రియ విముఖమై నీరసిస్తున్నదో నాకు నిశ్చయపూర్వకముగా తెలుపుము

దానికి పరమాత్ర ఒక పర్యాయం పునరాలోచించి ఈవిధంగా పలికాడు. ''ఉద్ధవా! ముక్తి అంటే అపరోక్షానుభూతి. దానివలన భగవత్సాక్షాత్కారం సిద్ధించే మహద్భాగ్యం కలుగుతుంది. దానికి నేనెన్నో మార్గాలు సూచించాను. అన్నిటిలోకి ఉత్తమమైనది భక్తి మార్గం. తక్కిన మార్గాలు అనుషంగికాలు మాత్రమే. ఈసంగతి నేనే ఇదివరలో చెప్పాను. అదే వేదము అని పిలవబడింది. ప్రళయకాలంలో అది రూపుమాసింది. మరి యొక కల్పారంభంలో దానిని నేను బ్రహ్మదేవునికి మళ్ళీ



ఉపదేశించాను. ఆయన తన పుత్రుడైన 'మనువు'కు ఆయన మరీచ మొదలైన వారికి, వారి ద్వారా సుర, యక్ష, గంధర్వ, కిన్నెర, గుహ్య, విద్యాధర, సిద్ధ, సాధ్య, చారణాది అనేక దేవగణములే గాక నాగ, మర్త్య గణములు కూడ ప్రసిద్ధమైన అట్టి జ్ఞానమున పొందినవి.

"దేవా! సృష్టిలో ఇన్ని జాతు లెట్లేర్పడినవి"! అని ఉద్ధవుడు ప్రశ్నించాడు.

పరమాత్మ ఇట్లు సమాధానం చెబుతున్నాడు." చరాచర కోటిలో తెగలు ఏర్పడుతున్నాయి. స్వభావమంటే ప్రకృతి. అది గుణత్రయ రూపంలో వ్యక్తమవుతుంటుంది. రకరకములైన సమ్మేళనములతో, అంశల యొక్క తారతమ్యంతో చిత్రవిచిత్రమైన భావాలతో ఎన్నెన్నో ఉపాధులేర్పడుతున్నాయి ఉపాధిని బట్టి మనోవృత్తి, బుద్ధి శక్తి ఉంటాయి. వారే ఇన్ని జాతులుగా వ్యక్తమవుతున్నారు."

అంత, ఉద్ధవుడిలా ప్రశ్నిస్తున్నాడు. "స్వామీ! మరి నీవు చెప్పిన వేదానికి ఇన్ని భిన్నార్థాలు ఎందుకు

చెబుతున్నారు?" మనోహరంగా నవ్వి శ్రీకృష్ణ పరమాత్మ ఇలా అంటున్నాడు. "ఉద్ధవా! నేను చెప్పిన సత్యాన్నే గురు,శిష్య,ప్రశిష్య పరంపరలో ఒకరి నుంచి వేరొకరికి కొన్ని మార్పులతో చేరింది. దీనికి వారివారి బుద్ధి భేదమే కారణం. బుద్ధి తన ఊహకు తగ్గట్లుగా కల్పనను మేళవించి తను నమ్మిన 'సత్యాన్నే' తనకి నచ్చినట్లు చెబుతుంది. అదే ఈ మార్పులకి కారణం.

నాయనా! బుద్ధినిబట్టి 'రుచి' కలుగుతుంది. ఏది ఎవరికి రుచిస్తుందో దానినే వారు 'పరమార్ధంగా' భావిస్తారు. రుచి భేదం మార్గభేదం క్రింద పరిణమిస్తుంది. ఒక ఉదాహరణ చెబుతాను విను. మీమాంసకులు ఏమంటున్నారు? జీవికి ధర్మమే ఉత్తమ మార్గం. వాత్స్యాయనాదినై యాయికులేమంటున్నారు? యశః కామములే ప్రధానము. యోగసాధకు లేమని నమ్ముతారు? శమ, దయ, సత్యవ్రతములు సర్వశ్రేష్ఠములు. చార్వాకులేది ముఖ్యమంటారు? యథాసంతుష్ట సుఖమే పరమప్రాప్యమని అంటారు. కర్మఠులేమంటారు? యజ్ఞయాగములు,



వ్రతములు, తపోదీక్షలు ప్రధానమంటున్నారు.

ఉద్ధవా! వీరిమార్గాలే వేరు. కాని వారందరి బోధనలలో సూక్ష్మార్ధం ఒక్కటున్నది. అదే కర్మవలన గమ్యం చేరవచ్చని, అయితే కర్మచే సాధించే ఫలములన్నింటికి ఆద్యంతములుంటాయి. అందుచే నశ్వరమైన తాత్కాలిక సుఖం కోరేకంటే శాశ్వతమైన భగవత్ప్రాప్తి అనే సుఖం కోరుకోవటం మంచిది కదా! అది విషయ బుద్ధికి లభించదు. ఎందుకంటే విషయబుద్ధి వలన కలిగే కర్మఫలం అశాశ్వత సుఖాన్ని మాత్రమే ఇస్తుంది.

నాయనా! శాశ్వత సుఖాన్ని కోరేవాడు. విషయార్ధాలను ఉపేక్షించి మద్గత చేతస్కుడై నాయందే చిత్తాన్ని నిలిపియుంచాలి. అట్టివారు తమకు త్రిలోకాధిపత్యం ఆశజూపినా, చివరికి బ్రహ్మలోకం లభించినా లెక్కజేయరు. పునర్జన్మ లేకుండా చేస్తానన్నా వద్దంటారు. శాశ్వత సుఖమే వారి ప్రధాన లక్ష్యం.

ఉద్ధవా! మర్త్యులంతా ఏదో ఒక అర్ధాన్ని ఆశించే నన్ను భజిస్తుంటారు. మద్గత చిత్తుడైన వాడు మాత్రం దేనిని



అపేక్షించదు. కేవలం నా ప్రేమకోసమే నన్ను ప్రేమిస్తాడు కానీ నానుంచి ఏమీ ఆశించదు. ఇట్టి ప్రేమనే 'పరాభక్తి' అంటారు. అటువంటి భక్తుడు నాకు బ్రహ్మకంటే పరమేశ్వరునికంటే, చివరికి శ్రీదేవికంటే నాకు ప్రియతముడు. అతనిని ప్రేమించినంతగా నేను నన్నుకూడా ప్రేమించుకోను. అతని పాదధూళి సోకితే ఎంతో పవిత్రుడనవుతానని నేను భావిస్తాను. అతని అడుగులో అడుగువేసి నడుస్తుంటాను. మదనురక్త చిత్తుడు, నిష్కాముడు, నిఖిల జీవుల పట్ల అనురాగముగలవాడు అయిన నాభక్తుడు పొందు ఆనందం ఇంతింత అని జెప్పనసాధ్యము. ఇంద్రియవశులైనా, నాభక్తిచే ఎంతో మేలుపొందే వారున్నప్పుడు ఇంద్రియ విముఖులైన నాపరాభక్తుల గురించి వేరుగా చెప్పవలెనా?

నాయనా! అగ్ని ఇంధనాన్ని రగిలించినట్లే నా భక్తి వారి పాపాలను దహించి వేస్తుంది. నేను స్థిరభక్తికి సాధ్యపడినంత తేలికగా ధర్మాది పుణ్యకార్యాలకు, సాంఖ్య యోగం వంటి సాధనలకు దొరకను. శ్రద్ధాపూర్వక భక్తి కంటే ఉత్తమమేదీ కాదు. నైసర్గిక మాలిన్యాలన్నీ బాసి అట్టి ఉపాధి అగ్నితప్తలోహం వలె విశుద్ధం అవుతుంది.



మలినోపాధులుగల శ్వపాకులు కూడా నాభక్తిచే పరిశుద్ధులై కడతేరుతున్నారు.

దానికి ఉద్ధవుడు 'శుద్ధి అంటే ఏమిటి స్వామీ!" అని అడిగాడు.

శ్రీకృష్ణ పరమాత్మ ఇలా వివరిస్తున్నాడు.

**"ఉద్ధవా! ఇక్కడ శుద్ధి అంటే చిత్తశుద్ధి అని భావము. చిత్తశుద్ధి దయా, సత్య, ధర్మవర్తనముల వల్ల కలుగుతుంది అని కొందరి విశ్వాసం. కొందరు విద్య, తపస్సుల వల్ల కలుగుతుందంటారు. చిత్తము ఎంత త్వరగాను, సులువుగాను, పరిపూర్ణంగాను, భక్తివలన శుద్ధమవుతుందంటే మరే ఇతర విధానం వలన అట్లా చిత్తశుద్ధి కలుగదు. నా భక్తి వలన పరిశుద్ధమైన చిత్తానికీ, పరసాధనల వల్ల శుద్ధమైన చిత్తానికీ ఎంతో తారతమ్యం ఉంది. నాభక్తిచేత శుద్ధమైన చిత్తం పూలకంటే మృదువైనది, శరత్కాల చంద్రునికంటె చల్లనైనది. అది చల్లని ప్రేమామృతాన్ని కురిపిస్తుంది. నామాట వినగానే అతను హర్షపులకితుడవుతాడు.**

**అన్య సాధనలచే పరిశుద్ధమైన మనస్సు, ఇంకిన కొలనువంటిది. ఎండిన మ్రానువంటిది అని గ్రహించుము.**

మళ్ళీ ఉద్ధవుడిలా అడుగుతున్నాడు. "దేవా! ముక్తికి ఎవరైనా అర్హులా లేక వేదజ్ఞులు మాత్రమేనా?" పరమాత్మ మందస్మితుడై ఇలా అన్నాడు. ఉద్ధవా! నీవా భ్రాంతిలో ఉండకు. విద్యావంతులైనా విద్యావిహీనులైనా, భాగ్యవంతులైనా నిరుపేదలైనా, పురుషులైనా, స్త్రీలైనా, ఏ కుల జాతి మతం వారైనా, ఏవయస్సువారైనా నాభక్తులైతే చాలు. ముక్తికి అర్హులు. ఐశ్వర్యానికి, తర్కాలకు విద్వత్తుకు, ఆడంబరాలకు నేను లొంగను. నన్ను కన్నుగప్పి మోసగించటం అసాధ్యం. ఎందుకంటే నేను అందరి హృదయ స్థితుడను. వారి హృదయాలలో జనించే ఆ భావాలు నాకప్పటికప్పుడే తెలుస్తాయి. నా ఆశ్రయులందరూ ముక్తికి అర్హులే.

ఉద్ధవా! ఆనాడు కురుక్షేత్రంలో నేను అర్జునునికి బోధించిన భగవద్గీత కర్మయోగమే ప్రధానోద్దేశ్యంగా ఆతనిని యుద్ధోన్ముఖుని చేయుటకై చెప్పాను. గురువు ఎప్పుడూ శిష్యుని మనస్తత్వాన్నిబట్టి ఉపదేశించాలి. వారికి బుద్ధి బేధం కలిగించరాదు. అర్జునునిలో ఆనాడు రజోగుణం ప్రకోపించి



ఉండినది. అందువలన పార్థుడు స్వతంత్రించి నాతో వాద ప్రతివాదనలు సలిపి 'నీవెన్ని చెప్పినా నేను నా బంధువులను చంపలేన'న్నాడు. నాపై తిరుగుబాటు చేసి ధనుర్బాణాలను త్యజించాడు. అవన్నీ రజోగుణ లక్షణాలు. రజోగుణం నశించి సత్త్వగుణం వృద్ధి పొందితే గాని తత్త్వరహస్యం బుద్ధిలో స్థిరపడి అనుష్ఠానానికి రాదు.

నిష్కామకర్మవలనగానీ రజస్సు నశింపదు. అందువల్ల అతనికి ఆనాడు జ్ఞానాన్ని పరమావధిగా చూపి, జ్ఞాన సిద్ధికి భక్తి సాధనమవుతుందని బోధించాను. భక్తి కుదరటానికి చిత్తశుద్ధి కలగాలని బోధించాను. చిత్తశుద్ధికి నిష్కామ కర్మయోగం అత్యవసరమని వివరించాను. అందులకై కర్మయోగ రహస్యాలన్నీ విపులీకరించి చెప్పాను. చిట్టచివరి అస్త్రంగా అతనికి దివ్య చక్షువులనిచ్చినా విశ్వరూపదర్శనం కూడా చేయించాను. ఇంత జరిగితే కాని నా అభిమతమైన దుష్టశిక్షణ జరగలేదు.

ఉద్ధవా! నేటి పరిస్థితి వేరు. నీతత్వం సత్త్వగుణ ప్రధానమైనది. అందువల్ల మొదటిలోనే నాకు



దాసోహమవుతున్నావు. నా ఉపదేశాన్ని భక్తితో తలదాల్చావు. ఆ కారణాన నీకు అనుకూలమైన భక్తి మార్గాన్ని బోధిస్తూ నీకు తత్త్వోపదేశాన్ని చేశాను. అదే శ్రేష్ఠమైన ముక్తికి పరమసాధనం. భక్తుడవైన నీకు అవధూత బోధిస్తున్నట్లు, హంస బోధిస్తున్నట్లు, భిక్షువైన గురువు బోధిస్తున్నట్లు ఆయా సందర్భాలలో నీకు రాబోయే సందేహాలను తొలగించి జ్ఞానబోధ నేర్పాను.

ఇక సర్వం విడనాడి నన్నే పరమగతిగ భావించి నా అంతిమ బోధనాకర్ణించు.

**సీ॥ మొదలిడినవియన్ని తుదిజేరు నుద్ధవా!**
**ఇదికూడ అదేరీతి యెరుగుమయ్య!**
**నను నమ్మి తమ 'ఆత్మ' నాకర్పణ జేయు**
**వారికాపద రాదు బాధ రాదు**
**"ఉద్ధవగీత"గా ఉర్విని ఈ బోధ**
**వాసికెక్కును నీవు బడయ కీర్తి**
**'బదరికాశ్రమము'న మది ప్రశాంతిని బొంది**
**స్వానుభవముజేత సర్వమీవు**



**ఆ॥ చేసికొనుము సిద్ధి, చేకూరు నాకృపన్**
**మేలుకలుగు ముక్తి ఫలము దక్కు**
**నీవు భక్తుడవుట నీకెరింగించితిన్**
**శుభము కలుగు దీని 'సుంత' నేర్వ**

ఆ విధంగా శ్రీకృష్ణపరమాత్మయొక్క అంతిమ బోధ ఉపదేశంగా వినిన ఉద్ధవుడు హర్షపులకిత గాత్రుడై భగవానుని చరణ కమలములను భక్తితో కన్నులకద్దుకొని పునః పునః సాష్టాంగ దండ ప్రణామముల నాచరించి ఇలా అన్నాడు.

**చం॥ తొలగెను మోహమంతయును తోయజనాభ!**
**దయాంబురాశివై**
**పలికిన 'గీత బోధనలు' బాగుగ వింటిని**
**అందుచేతనే**
**కలిగెను 'జ్ఞాన సంపదయు' కామన తీరెను**
**నీకు మ్రొక్కెదన్**
**నిలుపుము నాహృదిన్ యెపుడు నీచరణాబ్జము**
**లందు మాధవా!**

అనంతరం ఆనందాశ్రువులతో ఉద్ధవుడు బదరికాశ్రమానికి బయలుదేరాడు.

## ఉపసంహారము

అంత ద్వారకానగరంలో పెను ఉత్పాతాలు దుశ్శకునాలు చూపట్టాయి. వాటిని జూచి యాదవులు బెంబేలుపడి శ్రీకృష్ణునర్థించగా ఆయన ఇలా అన్నాడు. **ఆర్యులారా! చింతించకండి. ఈ ఉత్పాతాలు మృత్యుసంకేతాలు. మీకు దుర్వాస మహాముని శాపం గుర్తున్నది కదా! సాంబునికి స్త్రీవేషం వేసి ఈ గర్భవతికి ఏ శిశువు జన్మిస్తుందని మీరు వేళాకోళమాడినప్పుడు ఆయన యాదవ కులనాశనియైన 'ముసలం' పుడుతుందని అనలేదా? అట్లే సాంబుడు పురిటి నెప్పులనుభవించి ఒక ఇనుప ముసలాన్ని (రోకలిని) ప్రసవించలేదా? మీరు భీతావహులై నన్ను కర్తవ్యం అడిగితే** దానిని రాతిపై అరగదీసి **ఆ రజను నీటిలో కలపమన్నాను కదా!**

**విప్రశాపం మిమ్మల్నందర్నీ దహించక ముందే మీరు స్త్రీబాలవృద్ధులనందరినీ శంఖద్వారానికి తరలించండి. తరువాత సరస్వతీ నదీ తీరంలో ఉన్న ప్రభాస క్షేత్రానికి పోయి అక్కడ తీర్థస్నానం చేసి శుచులమై, ఉపవసించి, చిత్త సమాధాన పూర్వకంగా దేవపూజల గావించెదము.**



**తరువాత మహాత్ములైన విప్రులను పూజించుదాం. వారిచేత శాంతికర్మల నాచరింపచేద్దాం. గో, భూ, సువర్ణ, వస్త్ర, గృహ వాహన దానముల నాచరించుదాం** అవి బోధించిన దేవకీ నందనునితో అందరూ ఏకీభవించారు.

శంఖద్వారానికి తరలింపులయ్యాక యాదవులు ఓడలెక్కి సముద్రం దాటి, రథాలెక్కి ప్రభస తీర్థం చేరారు. పాప పరిహారార్థం శ్రీకృష్ణుడు చెప్పినవన్నీ చేశారు.

ఆపైన సుష్టుగా భోజనం చేసి ఉల్లాసానికి కల్లు సేవించారు. కైపెక్కి ఒకరితో ఇంకొకరు పరాచికాలాడుతూ కయ్యానికి దిగారు. తమ రక్షణకోసం తీసుకొని వెళ్లిన విల్లంబులు, కత్తులు, గదలతో కొట్టుకోసాగారు. ప్రద్యుమ్నుడు సాంబునితోను, అక్రూరుడు భోజునితోను, అనిరుద్ధుడు సాత్యకితోను, సుమిత్రుడు సురధునితోను, ఢీకొని పోరు సల్పారు. కొన్నిచోట్ల ద్వంద్వ యుద్ధాలు గాక జంటలుగా యుద్ధం చేశారు. ఈవిధంగా దాశార్హులు, భోజులు, అంధకులు, వృష్ణులు, సాత్వతులు మొదలగు యాదవులంతా ఒకరితోనొకరు కలహించి ఆయుధాలు చాలక సముద్రం



ఒడ్డున పెరిగి ఉన్న తుంగను పెరికి ఒకరినొకరు కొట్టుకున్నారు. అది ముసలం అరగ తీస్తే వచ్చిన చూర్ణం నుంచి మొలిచిన తుంగగా గుర్తించి బలరామకృష్ణులు వారికి నచ్చజెప్పబోయారు. యాదవులు వారినీ లక్ష్యబెట్టక పట్టుకొని కొట్టబోయారు. "వినాశకాలే విపరీత బుద్ధి" అన్నది జగమెరిగిన సత్యమేకదా!

చివరికి అన్నాళ్లు కంటికి రెప్పలా కాపాడిన బలరామకృష్ణులే మిగిలిన యాదవుల్ని సమూలంగా సంహరించారు. సర్వనాశనం అయిపోయింది. యాదవకులం అంతరించింది. భూభారం తగ్గిపోయి శాంతి చిగురించటానికి తెరలేచింది. బలరాముడు సముద్రతీరంలో ఒకచోట కూర్చుని యోగవిద్య ద్వారా మర్త్యలోకం త్యజించి పరమాత్ముని చేరుకొన్నాడు.

బలరాముని నిర్యాణం తరువాత శ్రీకృష్ణభగవానుడు ఆ సమీపంలో నున్న ఒక అశ్వత్థవృక్షం (రావిచెట్టు) మొదటజేరి చతుర్భుజ రూపం ధరించి, కుడితొడపై ఎడమ పాదం ఉంచి కూర్చున్నాడు.



అంతట జరుడు అను పేరుగల బోయవాడు. తన బాణానికి మొదటి భాగాన ఒక వాడి ములుకును కట్టి వేటకోసం అటువచ్చాడు. ఆ ఇనుపముల్లు ఇదివరలో యాదవులు సాంబుని గర్భజనితమైన ముసలాన్ని అరగదీస్తే చిట్టచివరికి మిగిలిన వాడి సూదివంటి తునక. దానిని యాదవుల సముద్రంలో పారవేస్తే ఒక చేపదానిని మ్రింగింది. ఆ చేపని పట్టుకొని చంపి తినబోయిన ఒకడు ఇనుపముల్లును చూసి తన స్నేహితుడైన జరునికి ఇచ్చాడు.

ఈనాడు అదే బాణంతో వేటకు వచ్చిన జరుడు ఎడమ పాదాన్ని అటూ ఇటూ ఆడిస్తున్న శ్రీకృష్ణుని దూరంనుంచి చూచాడు. అతనికి భగవానుడు కనబడలేదు కాని కదులుతున్న పాదం కనబడింది. దానినేదో జంతువనుకొని అతను గురిచూచి ఆ పాదంలో ఇనుపముల్లు ఉన్న బాణం గుచ్చుకొనునట్లు వేశాడు. తన పొరబాటు గ్రహించి కన్నీరు మున్నీరైన జరుడు స్వామి పాదాలపై వ్రాలి ఇలా రోదించాడు.

కం॥ తెలియక సలిపితి ఘోరము
వలదిక మన్నింపు తగదు పాషండుని నన్
నిలువున నరుకుము త్వరగా
తొలగును పాపంబు దాన తోయజనాభా!

కన్నీటితో క్షమాభిక్ష వేడితే కరకు దానవులనే క్షమించిన పరమ పావనుడు స్వామి లీలవల్లనే నేరస్థుడై పరితపిస్తున్న వానిని క్షమించడా?

అంతేకాదు వానికి దుర్లభమైన సశరీర స్వర్గప్రాప్తి కల్పించి దేవతలతో నివాసం కల్పించాడు. ఇటువంటి లీల మున్నెవ్వరైనా చేశారా? శ్రీకృష్ణ పరమాత్మ అందుకే కడగొట్టువారికీ కరతలామలకం.

అంతలో శ్రీకృష్ణుని రథసారథి 'దారకుడు' భగవానుని రథం తోలుకొంటూ అక్కడికి వచ్చాడు. తులసీదళాల పరిమళం వల్ల 'వనమాలిని' గుర్తించి ఆయనపడియున్న స్థితిని జూచి భోరున విలపించాడు. స్వామి అతనిని అనునయించాడు. దారకుడు చూస్తుండంగానే ఆ రథం దానికున్న శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహక మనుపేర్లుగల నాలుగు తెల్లని



అశ్వములతో సహా ఆకాశమార్గాన ఎగిరిపోయింది. దానివెంట స్వామి ఆయుధాలైన సుదర్శన చక్రము, పాంచజన్యమను శంఖము, కౌమోదకము అను గదా, శారజగము అను విల్లునంబులు, నందకము అను ఖడ్గము తరలిపోయాయి. దారకుడు ఇదంతా చూసి నిశ్చేష్టుడయ్యాడు.

వానిని దగ్గరకు పిలిచి స్వామి "సారధీ! నీవు ద్వారకకు వెళ్లి యాదవులు ఒకరినొకరు చంపుకొనిన సంగతి, బలరాముని నిర్యాణము, ఉద్ధవుని బదరికావన ప్రస్థానము, నాయీ దుస్థితిని నావారందరికి తెలియజెప్పు. నేను ప్రాణాలు విడిచినంతనే సముద్రం ద్వారకా ద్వీపాన్ని నీ టముంచేస్తుంది. అందుచే అందరూ ద్వారకనొదలి వారివారి వస్తువులతో సహా వెళ్లిపోవాలి. నా తల్లిదండ్రులను, వృద్ధులను, బాలురను, స్త్రీలను, ఇంద్రప్రస్థమున అర్జునుని రక్షణలో ఉండమని చెప్పుము.

ఇది అంతయూ నా మాయారచిత దృశ్యమాన ప్రపంచం అని నీవు గ్రహించి నిర్లిప్తుడవై నీ జీవితము ముగియుదాక గడుపుము. నీకు అంత్యమున మోక్షం సిద్ధిస్తుంది అని చెప్పి



శ్రీకృష్ణ పరమాత్మ ధ్యాన సమాధిలో అచేతనుడయ్యాడు. ఆయనకు ముమ్మారు ప్రదక్షించి కన్నీటితో దారకుడు సెలవు తీసికొని ద్వారకకు వెళ్లాడు.

అంతలో పార్వతీపరమేశ్వరులు, వాణీబ్రహ్మదేవుడు, శచీదేవిదేవేంద్రుడు, యక్షకిన్నెర, కింపురుషాది దేవతలు పిత్రు దేవతలు దిక్పాలురు తమ తమ వాహనాలపైన విమానాలపై గగనతలమంతా క్రిక్కిరిసి వైకుంఠవాసుని ఆగమనానికై ఎదురు చూడసాగారు.

ఆవిర్భవించిన దగ్గరనుంచి అవతార సమాప్తిదాక అనన్య దుష్కరమైన లీలలు ప్రదర్శించి, దివిజులచేత మునీశ్వరులచేత జ్ఞానుల చేత 'కృష్ణం వందేజగద్గురుమ్' అని వేనోళ్ల కీర్తింప బడిన శ్రీకృష్ణ పరమాత్మ చివరికి శ్రీమన్నారాయణుడై వైకుంఠం చేరుకొన్నాడు.

ఇక్కడ ద్వారక చేరి దారకుడు అంతా స్వామి చెప్పినట్లే చేశాడు. దేవక, రోహిణి వసుదేవులు పుత్రవియోగదుఃఖహతులై ప్రాణాలు విడిచారు. యాదవపత్నులు వసుదేవుని తక్కిన భార్యలు చితులుపేర్చుకొని ఆహూతైప్రాణాలు త్యజించారు. శ్రీ కృష్ణుని



కోడళ్ళూ, ఆయన అష్ట భార్యలు అదేరీతి తనువులు త్యజించారు.

అర్జురుడు ద్వారక కేతెంచి భగవానుని గీతాబోధన స్మరించుకొని కన్నీటి కాల్వలను సహించి ఆయన ఆజ్ఞలను తు.చ. తప్పకుండా పాటించాడు. భగవానుని ప్రార్ధించాడు.

ఇంతలో పరమాద్భుతం జరిగింది. సముద్రం నిలువెత్తునా పొంగి ద్వారకా నగరాన్ని తనలో కలిపేసుకొన్నది. భగవానుని ఆలయం ఒక్కటి మినహాయించి సర్వమూ సాగరగర్భంలో కలిసిపోయింది.

తరతరాల చరిత్రకు సాక్ష్యంగా నేటికీ అంటే 21-5-2010 నాటికీ ఆలయం అలాగే స్వామి రాక కోసం ఎదురుచూస్తూ ఉన్నది.

శ్రీ కృష్ణ భగవానుడు నేటికీ సన్నిహితుడై ఆమందిరంలో ఉన్నాడు. ఆమందిరంలో కూర్చొని స్వామిని ధ్యానిసై సర్వపాపములు నశించి నిఖిల సన్మంగళములు సిద్ధిస్తాయి. ఇది సత్యం. మీదే ఆలశ్యం.

"లోకాః సమస్తా స్సుఖినో భవంతు"